# జ్యోతిర్మయి

అవసరాల వెంకటనర్సు

యువ బుక్ డిపో
ఆచారప్పన్ వీధి :: గవర్నరుపేట
మద్రాసు :: బెజవాడ

2

యువ ప్రచురణ :
ప్రథమ ముద్రణ :

జె. బి. ప్రీస్ట్లీ వ్రాసిన
''కే టు ఎ సిటీ''
అనుసరించి వ్రాసినది.

బి. ఎన్. కె. ప్రెస్,
మద్రాసు.

# కృతజ్ఞత

నాటకాలలో నాకాసక్తి పుట్టించిన మా కార్యదర్శి బలరాజ్ సహానీకీ; ఈ నాటకరచనలో నాకు తోడ్పడి ప్రోత్సహించిన బ్రహ్మారెడ్డి, శ్రీమాన్, 'శాంతమ్మ' గార్లకీ నే నెంతో కృతజ్ఞుడను.

బొంబాయి
20-8-1946

అవసరాల వెంకటసర్మ
మెంబరు,
భారత ప్రజా నాట్యమండలి,
బొంబాయిశాఖ.

## పాత్రలు

| | | |
|---|---|---|
| రామమోహన్ | .... | మరల పనివాడు |
| వెంకట్రావు | .... | స్వతంత్రభారత బాంకి మేనేజరు |
| శ్రీకాంతయ్య | .... | వ్యాపారస్తుడు |
| రాజాబహద్దుర్ విశ్వేశ్వరరావు | | జమీందారు |
| జ్యోతిర్మయి | .... | సినీమానటి |
| భాగ్యేశ్వరి | .... | వెంకట్రావు భార్య |
| మహాలక్ష్మమ్మ | .... | కీ॥ శే॥ సర్. పి. మాధవరావుగారి భార్య |
| లావణ్య | .... | మహాలక్ష్మమ్మ కూతురు |
| సీతారామమ్మ | .... | వంటావిడ |

# సూచన

స్టేజికి కుడివైపు నటీనటులకి కుడివైపు ఓ రాతిగోపురం, గోపురంలో అమర్చి ఓ పెద్దతలుపూ ఉంటాయి. గోపురాన్ని చేర్చి స్టేజి వెనుకభాగం ఆవరిస్తూ ఓ రాతిగోడ ఉంటుంది. ఈ గోడ ఆట్టే ఎత్తైనదికాదు కాని వెడల్పైనది. ఎడమవైపునుంచి గోడమీదికి ఎక్కడానికి రాతి మెట్లుంటాయి. గోడదిగువని రెండు రాతిదిమ్మలుంటాయి. గోడవెనుక ఆకాశమున్నట్టు తెరపెట్టాలి.

తలుపు తెరుచుకునేదాకా రాకపోకలు గోపురమున్న వేపునుంచి కాదు. రెండో వేపునుంచి. (అనగా ఎడమ వేపునుంచి) తలుపు తెరుచుకున్నాక గుమ్మంలోంచి రాకపోకలకి 'గుమ్మంలోంచి' అని వ్రాసుంటుంది. మిగతావి ఎడమవేపునుంచి.

ఆయా సందర్భాలనిబట్టి ఫోకసింగ్ లైట్ల వెలుతురులో నటీనటుల్ని చూపాలి. ఈ నాటకం తెల్లవారుజాము మొదలుకుని సూర్యాస్తమయంవరకూ నడుస్తుంది. వేరు వేరు వేళలకి తగ్గ వెల్తురు వేరువేరు రంగుదీపాల సాహాయ్యంతో కనపర్చాలి.

# ప్రథమాంకం

[తెరఎత్తేసరికి స్టేజి అంధకారమయమై ఉంటుంది. ఫోకసింగ్ లైటు వెలుతురులో మనం మహాలక్ష్మమ్మని చూస్తాం. ఈవిడ యాభై ఏళ్ళది; లావుపాటి మనిషి; వితంతువుకాని, ఈవిడ ఒంటిని విలువైన నగలూ, బట్టలూ చూస్తాం]

మ:—లావణ్యా, లావణ్యా! (బిగ్గరగా) ఓ లావణ్యా! నువ్వెక్కడున్నావే ?

లా:—(చీకటిలోంచి తాపీగా) వస్తున్నా అమ్మా, వస్తున్నా.

మ:—(చిరాకుగా) నన్నొక్కర్తినీ ఒదిలేసి ఎక్కడికిపోయావే? ఇలాంటప్పుడా నన్నొదిలేసిపోతావ్, ఏ ప్రమాదమైనా జరుగుతేనో ?

[మహాలక్ష్మమ్మ మాట్లాడుతూండగా లావణ్య వెలుతురులోకి వస్తుంది. లావణ్య పదహారు పదిహేడేళ్ళపిల్ల; కన్నూ, ముక్కూతీరున్నా రూపసి అనిపించుకోదు, చురుకైనదీ, గుండెధీమా ఉన్నదీ, అయినా, ఆ పిల్ల మొహాన్నేమీ యీ లక్షణాలు కనపడవు]

లా:—నిన్నొదిలి నే ఎక్కడికి పోయానమ్మా, నీ వెనకాలే వస్తున్నాగా? ఏదో కాని చప్పుడయితే ఎవరా అని ఒక్కక్షణమాగి చూశా.

మ:—అలాంటప్పుడు నువ్వసలే ఆగకూడదు. మనిద్దరం కలిసుండాలి కాని విడిపోతే ఎలా ?

లా:—విడిపోవడులే.

మ:—చూ డింకా అడుగులచప్పుడు వినపడుతూందా ?

లా:—ఇప్పుడేం వినపడ్డంలేదు.

మ:—మనం యిప్పుడెక్కడున్నామే ?

లా:—పరమాత్ముడికి తెలియాలి.

మ:—నీకు తెలియదని చెప్పరాదుటే ?

లా:—అవును నాకు తెలియదు. కేవుడి ధర్మమా అంటూ ఆ దిక్కుమాలిన "సౌందర్య విలాస్" హోటల్లోంచి బైటపడ్డాం. ఆ తరువాత ఏంజరిగిందో, ఎక్కడున్నామో! చచ్చిపోయామేమో ?

మ:— అఘాయిత్యం మాట్లాడక కూర్చో.

లా:— నువ్వు చెప్పు పోనీ, మనం ఎక్కడున్నామో. ఆహోటేల్లో దీపాలారిపోడం, డాబా కూలుతూన్న చప్పుడవడం—యివే నాకు జ్ఞాపకం.

మ:— డాబాయే కూలిందంటావా?

లా:— రాళ్లూ యిటికలూ పైనుంచి పడతూంటే నువ్వు వినలే?

మ:— మనలాంటి గొప్పవాళ్లకోసం కట్టిన ఆ హోటేల్లో, డాబా ఎందుకు కూలుతుందే? మేనేజర్నడుగుతా నుండీసంగతి.

లా:— మేనేజర్ని కలుసుకునేకదా నువ్వడగడం? ఈప్రాంతాల్లో ఎక్కడేనా ఉన్నాడేమో చూడు మేనేజరు.

మ:— చాల్లే నీవేళాకోళం. (క్షణం ఆగి) మనం ఎక్కడికి చేరుంటాం? ఆ పక్క మైదానంలోనే ఉన్నామేమో?

లా:— ఆ చుట్టుపక్కల లేం. ఈ జాగావే రాజాంగా వేరు. (క్షణం ఆగి) ఉండెవరో వస్తున్నట్టున్నారు.

మ:— (కంగారుగా) అమ్మో, ఎవరోనే.

లా:— భయపడకు, ఎవరో రానీ.

[శ్రీ కాంతయ్య వెలుతురులోకి వస్తాడు. ఇతనో వ్యాపారస్తుడు. మోస కాదని మొహమే చెపుతుంది. పొట్టిమనిషి. ఎదుటివాళ్లని తృణీకరిస్తూ సాధికారంగా మాటాడబోతాడు.]

శ్రీ:— ఎవరు మీరు? ఎంత వేళవుతుందిప్పుడు?

లా:— ఏమో, మాదగ్గర వాచీలు లేవు.

శ్రీ:— మీ పేరెవరో చెప్పారు కారు. నా పేరు శ్రీకాంతయ్య, నా పేరు మీరు వినే ఉంటారు.

లా:— నా పేరు లావణ్య, మా అమ్మ మహాలక్ష్మమ్మ.

మ:— శ్రీ కాంతయ్యగారూ, మనం 'సౌందర్య మహల్' చేరుకున్నామా?

శ్రీ:— సౌందర్యమహలా? ఎక్కడుంది? ఆ పేరెప్పుడూ నేవినలేదే.

లా:— అయితే మనమెక్కడున్నాం?

శ్రీ:—మా మంచి ప్రశ్నడిగావు, నే మిమ్మల్నడుగుదా మనుకుంటున్నదీ అదే.

లా:—పోనీ మీరిక్కడి కెలా వచ్చారో చెప్పండి.

శ్రీ:—ఏమో ఎలా వచ్చేనో, నాకే ఆశ్చర్యంగా ఉంది. అనుకోకుండా యిక్కడి కెలావచ్చేనో ? (క్షణం ఆగి) ఇది కలనుకుందా మనుకున్నా ఎప్పుడో కాని నాకు కలలూరావు. ఆఫీసులో లెఖ్ఖలు చూసుకుంటూ కూర్చున్నా, కాస్త కునుకు పట్టిందో ఏమిటో.

రా:—(నవ్వుతూ) అమ్మా, మనం కలలోవాళ్ల మనుకుంటున్నాడీయన !

శ్రీ:—అబ్బే, అలానుకోడంలేదు. నాకు బోధపడకుండా ఉన్నది-ఆఫీసులో కూర్చున్న వాడినిక్కడి కెలా వచ్చానో? ఉండండి, యిటువేపేముందో చూద్దాం. (అని గోడవేపు నెడతాడు. తల్లీ కూతురూ, అతనితో నెడతారు.) ఓ, యిక్కడేదో ఉంది. గోడలా కనిపిస్తూంది.

లా:—అవునిది గోడే.

శ్రీ:—ఏదో గోడదాపుకి చేరుకున్నాం, గుడ్డిలో మెల్ల.

లా:—ఏదో చోటికి చేరుకున్నాం.

మ:—ఎక్కడున్నామో ఎరగనప్పుడు ఏం సంతుష్టే, ఏదో చోటకి చేరుకున్నామనీ ?

శ్రీ:—(లావణ్యతో) అమ్మాయీ, మీ తండ్రిగారి పేరేమిటి ?

లా:—సర్ పి. మాధవరావుగారు.

శ్రీ:—సిల్కు వ్యాపారస్తులా ?

లా:—(నవ్వుతూ) అమ్మా మనం వ్యాపారస్తుల మనుకుంటున్నాడీయన.

మ:—(సగర్వంగా) ఆయన పోయేసరికి భవల్‌పూర్ ఎస్టేటు దివానుగా ఉండేవారు.

శ్రీ:—ఆయన పే రెప్పుడూ విన్న జ్ఞాపకంలేదే ?...అయినా, నే వ్యాపారస్తుడ్ని, దివానులతో నాకేం పని ? అయితే యింతకూ, మళ్ళీ మన ఊరు చేరుకోవడం ఎలా ?

లా:—ఇటువేపేదేనా దారుందేమో చూద్దాముండండి.

శ్రీ:—చూడు, చూడు, నే పోస్టాఫీసుకు వెళ్ళి రెండర్జంటు టెలిగ్రాములు పంపిరావాలి. (లావణ్య విరగబడి నవ్వుతుంది.) ఏమమ్మాయీ, ఎందుకు నవ్వుతున్నావ్ ?

లా:—ఎంత వెతికినా మీకీ చుట్టుప్రక్కల పోస్టాఫీసు కనపడదు.

మ:—నీకేం తెలుసే, యిక్కడేదేనా పోస్టాఫీసుందేమో! పోస్టాఫీసంటే జ్ఞాపకమొచ్చింది, మీ పిన్నిని ఒచ్చే ఆదివారం రమ్మని వ్రాద్దామనుకున్నా.

లా:—ఒచ్చే ఆదివార మొచ్చేసిందేమో.

శ్రీ:—అసందర్భంగా మాట్లాడుతున్నావమ్మాయీ.

లా:—ఇది సందర్భంగా ఉందిగనుకనా-ఎక్కడికొచ్చేమో తెలియకుండా ఇక్కడికి చేరుకోవడం ?

మ:—ఏమే లావణ్యా, నీ కాయాసంగా ఉందా ఏమిటీ ?

లా:—లేదమ్మా, యిదో చిత్రకథలా మనస్సు కుత్సాహం పుట్టిస్తూంది. ఎవరక్కడ ?

[చీకట్లోంచి 'నేను' అన్న జవాబు వస్తుంది. అటువేపు లావణ్య తొందరగా నడుస్తుంది. మహాలక్ష్మమ్మ, శ్రీకాంతయ్య ఆవిడ వెంట వెడతాడు.]

మ:—(వెడుతూ) అంత తొందరగా నడుస్తావేమే ? మేం ఒచ్చిందాకా ఆగు. జాగ్రత్త. ముందేముందో చూసుకు మరీ వెళ్లు.

[ముగ్గురూ చీకట్లోకి వెళ్ళిపోతారు. సీతారామమ్మ వెలుతురులోకి వస్తుంది. ఈవిడో ముసలి ముత్తైదు. ఈ విడచేతిలో బరువైన కూరలసంచి ఉంటుంది. చాలా కష్టపడి బతికిన మనిషి. ఇంట్లోవాళ్ళకి చాకిరీ చేసి, పైన వంటకీ వడ్డనకీ వెడుతూ ఉంటుంది. మనస్సు చాలా శాంతమైనది]

సీ:—ఎవరు వారు ? ఏమైపోయా రిక్కడున్నవాళ్లు ? ఇప్పుడేగా వాళ్ల మాటలు నే విన్నదీ ? ఇంతట్లో నే మాయమయ్యారే. పోనీ తెలుగు వాళ్ల మాటలు చెవినిపడ్డాయి, ట్రాములో కూర్చున్నంతసేపూ బెంగాలీ వాళ్ల కీసరబాసరె కదా. (చీకట్లోంచి 'ఎవరక్కడ' అన్న కేక వినపడుతుంది) మీ రెవరు ?

[రాజాబహద్దుర్ విశ్వేశ్వరరావు వస్తాడు. బుగ్గమీసాలూ, లాంగ్‌కోటూ, పెద్దపొట్ట, వెండిపొన్ను తొడిగిన చేతికఱ్ఱ—యివి చూసి యితనో జమీందారని అనుకోవచ్చు. ఠీవిగా మాటాడబోతాడు. గర్వికాని దుష్టుకాడు]

వి:—మాడమ్, గిండీక్లబ్బెటు కేసుంది?

సీ:—ఏం క్లబ్బు?

వి:—గిండీ క్లబ్బు. గుఱ్ఱపుపందాలు జరుగుతాయే, ఆ క్లబ్బు.

సీ:—ఏమో నాకు తెలియదు. నా ఊరికి పెరంబూరులో.

వి:—నే పెరంబూ రెందుకొచ్చానూ? ఇది పెరంబూరా?

సీ:—ఇది పెరంబూరు కాదు. ఓవేళ మీ ఊరేమో, దాని పేరేమిటి చెప్పారూ?

వి:—అవును. ఇది గిండీ అయుండాలి. . నే క్లబ్బులో కూర్చుని గుఱ్ఱాలకేసి చూస్తున్నా. నువ్వెప్పుడేనా గుఱ్ఱపు పందాలు చూశావా?

సీ:—మంచిమాటే అడిగారు. గుఱ్ఱాలనీ గాడిదల్నీ నే చూస్తూ కూచుంటే యింట్లో పనెవరు చేస్తారు?

వి:—గుఱ్ఱపు పందాలలో ఏం మజా వుందనుకున్నావ్, ఓమారు చూస్తే నువ్వొదిలిపెట్టవ్. ఆవేళ వెంకటగిరి కప్ డే. ఫస్ట్ రేస్ జరుగుతూ ఉంది. రెయిన్‌బో, లేడీస్‌లవ్, ప్రాడిగల్ మూడూ ఉన్నాయా రేసులో. ప్రాడిగల్ మీద నే బెట్ చేశా. ఇంతట్లో మా గేలరీ విరిగి కుర్చీలన్నీ కిందపడ్డాయి. నేనూ పడ్డా. తరువాత ఏం జరిగిందో! ఇక్కడి కెలా వచ్చానో!

సీ:—కూరలు కొనుక్కుని ట్రాములో ఎక్కి నే ఒస్తూఉంటే...

వి:—(అడ్డు తగిలి) ఇదిగో చూడు నాకోసమెవరేనా ఒస్తే యిటు కేసి వెళ్లమను. నా పేరు జ్ఞాపకముంచుకో, రాజాబహద్దుర్ విశ్వేశ్వరరావు.

సీ:—(చిరునవ్వుతో) అలాగే.

వి:—ఇంకెవరేనా ఉన్నారా యిక్కడ?

సీ:—ఎంతోసేపు కాలేదు, యిద్దరాడవాళ్లూ ఒకాయనా, యిటువే వెళ్లారు.

వి:—సరే, వాళ్ళనడిగి దారి తెలుసుకుంటా. ఎవరమ్మా అక్కడ ?

[అంటూ చీకట్లోకి వెళ్ళిపోతాడు]

సీ:—(తనలో) గుజ్జుపు పందాలు వేస్తావా అని నన్నడుగుతాడు. వాటిలో ఏం మజా ఉందనుకున్నాడో, ఓసారి చూస్తే మళ్ళీ వదిలిపెట్టనంటాడు...గట్టివాడే.

[చీకట్లోంచి "ఏమండోయ్, ఏమండోయ్" అన్న కేకలు వినపడతాయి. "ఏమండోయి మీరెక్కడున్నారూ? వినిపించుకోరేం? మాటాడరేం" అని యిందాకటికంటె బిగ్గరగా కేకలు వినపడతాయి. భాగ్యేశ్వరి వెలుతురులోకొస్తుంది. వయస్సులో ఉన్నదీ, అందకత్తె, అయినా ఎప్పుడూ రొప్పురొప్పు లాడుతూన్న మొహం.]

సీ:—ఎవరమ్మా నీక్కావలసింది, రావుబహద్దర్ విశ్వేశ్వరరావా ?

భా:—విశ్వేశ్వరరావుతో నాకేంపని ? నాక్కావలసింది మా ఆయన.

సీ:—ఎవరో ఆయన యిద్దరాడవాళ్ళతో యిటువేపు వెళ్ళాడు. పొట్టాయనలా కనిపించాడు.

భా:—మా ఆయన పొట్టాయన కాడు.

సీ:—మీరు యిద్దరూ కలిసి రాలేదూ ?

భా:—కలిసేవచ్చాం. ఇప్పటిదాకా కలిసే ఉన్నాము. ఎప్పుడూ కలిసే ఉంటాము.

సీ:—(తనలో అనుకున్నట్టు) ఏముంది, పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటం.

భా:—(తనమాటల ధోరణిలో) [illegible] చేసుకోక ఇష్టంకలిసే గోడుమొగ చేసుకున్నాం. ఆయనన్నారూ: "భాగ్యం, యిలా పడిపోదాం రా," నే అన్నా "అలా ఎందుకండీ, యిలారండి." అని. నామాట వినుండరు. వినుంటే నన్నొదిలేసి వెళ్ళేవారుకారు. ఎక్కడికి వెళ్ళారో, ఏమయిపోయారో.

సీ:—ఏమీ అయిపోడమ్మా, ఆయనే వస్తాడు, నువ్వు శాంతపడి కూచో. అక్కడేదో గోడుందని యిందాకటి వాళ్ళనుకుంటున్నారు. గోడ

దాకా వెళ్ళినా వెనక్కి మళ్ళవలసిందేగదా. కాసేపు నువ్వు కూచున్నావంటే నీ కాళ్ళదగ్గరకొచ్చి వాల్తాడు. మొగాళ్ళతీరే అదమ్మా.

భా:—నామాట వినకపోయుండాలి కాని నన్నొదిలి వెళ్ళేమనిషి కారు.

సీ:—మంచిమాటే. ఈ చుట్టుపక్కలా మీకాపరం?

భా:—మేం త్యాగరాయ నగరంలో ఉంటూంటాం. అక్కడ స్వతంత్రభారత బ్యాంకి కీయన మేనేజరు.

సీ:—ఈవే పెందు కొచ్చారూ?

భా:—మేం ఉభయులం రైలెక్కి నెల్లూరు వెడుతున్నాం. మా మామయ్య సెలవలకి రమ్మని వ్రాస్తే బైలుదేరాం.

సీ:—కూరలు కొనుక్కుని ట్రాంలోఎక్కి నే ఒస్తూఉంటే...

భా:—(అడ్డుతగిలి) అగ్గె లో సొరంగంలోంచి వెళుతూంది. అంతా చీకటయిపోయింది. ఆయనన్నారు. "భాగ్యం, యింత చీకటేమిటే, ఒకవేళ మనం చచ్చిపోయామేమో," "చాల్లెండి, అఘాయిత్యపు మాటలాడకం" డన్నా నేను.

సీ:—అవునమ్మా, చచ్చిపోయిన వాళ్ళకీ లోకస్పర్శే ఉండదు. వాళ్ళకేదీ అంటకేనా పోవాలి, వాళ్ళ అనుభవమేనా వేరుగా ఉండాలి. మనం చచ్చిపోయా మనడానికివీల్లేదు. నాకాళ్ల నలుపెప్పట్లాగే ఉందా. కూరలసంచీ యిక్కడే ఉందా. నే చచ్చిపోయుంటే యిదీనాతో వచ్చేదా? సగంచెప్పి ఆపుచేశా, కూరలు కొనుక్కుని ట్రాంలో ఎక్కి నే ఒస్తూ ఉంటే...

భా:—(అడ్డుతగిలి) మా ఆయన్ని వెతకడానికి నే వెడతా.

సీ:—ఎందుకమ్మా, ఆయనే వస్తాడు.

భా:—ఏమయ్యారో, ఎక్కడికెళ్ళారో, నే యిక్కడ కూచుంటే ఎలా? ఏమండీ ఎక్కడున్నారు?

[అంటూ చీకట్లోకి వెళ్ళిపోతుంది]

సీ:—నిత్యం వ్యాకులపడే మనిషి; తా సుఖపడదు, వొకరిని సుఖపడనివ్వదు.

[దూరాన్నుంచి మాటలు వినపడతాయి. వెంకట్రావూ జ్యోతిర్మయి మాట్లాడుకుంటూ వెలుతురులోకి వస్తారు. వెంకట్రావు భాగ్యేశ్వరి మొగుడు. నడివయస్సు వాడు. జ్యోతిర్మయి సినీమానటి. పాతికేళ్ళ వయస్సుది. ఓ మోస్తరందకత్తె. పెంకి. పోకిరీలా మొదట్లో మనకి కనిపిస్తుంది. కాని వెళ్ళినకొద్దీ మన కామెతో సానుభూతి ఏర్పడుతుంది]

వెం:—డైరక్టరామాటంటే మీరేమన్నారు ?

జ్యో:—వాడి మొహం మీదే చెప్పేశా: నీ పెత్తనం అఘోరించినట్టే ఉంది. ఇదిగో నీ కంట్రాక్టు. నాకు రావలసిన అణాపైసలూ లెక్క పెట్టి యిచ్చెయ్యి, అని స్టూడియోలోంచొచ్చాశా.

వెం:—తరువాతేం జరిగిందీ ?

జ్యో:—స్పృహతప్పి రోడ్డు మీద పడిపోయానో ఏమిటో, మళ్ళీ మిమ్మల్ని కలుసుకోవడమే నాకు జ్ఞాపకం.

సీ:—(వెనుకనుంచి) కూరలు కొనుక్కుని ట్రాంలో ఎక్కి నే వస్తూ ఉంటే.........

జ్యో:—(అడ్డుతగిలి) ఎవరండీ మీరు ? మిమ్మల్ని చూడనేలేదు.

సీ:—సీతారామమ్మ నా పేరు. నీ పేరో ?

జ్యో:—నా పేరు జ్యోతిర్మయి.

సీ:—ఈయన భాగ్యమన్నావిడకి చుట్టమా ?

వెం:—భాగ్యేశ్వరి మా ఆవిడేనండీ. నా పేరు వెంకట్రావు.

సీ:—మీ కోసం ఆవిడ ఊరూ వాడా వెతుకుతూంది.

వెం:—నేనూ వెతుకుతున్నానండీ దానికోసం.

జ్యో:—ఎప్పటినుంచీ వెతుకుతూంట? నా మాట వింటూన్నంతసేపూ అదేనా ఏమిటి మీరు చేస్తున్న పని ?

వెం:—భాగ్యం ఏమయిందా అనే చింత నాకు లేదనుకున్నారా ? (సీతారామమ్మతో) అటువే వెళ్ళిందండి?

సీ:—ఇటు.

వెం:—(అటు రెండడుగులేసి) భాగ్యం, భాగ్యం !

భా:—(చీకట్లోంచి) ఎక్కడున్నారండీ మీరూ ?

వెం:—ఇక్కడ, యిటు యిటు.

జ్యో:—(దగ్గరగా) ఇటు వేపండోయి, యిలా రండి.

[భాగ్యం ప్రవేసించేసరికి జ్యోతీ వెంకట్రావూ ప్రక్కప్రక్కల నిలబడుంటారు]

భా:—మీ రెక్కడున్నారా? ఎంతసేపాయి మీకోసం వెతుకుతున్నానండీ.

వె:—నే నీకోసం వెతుకుతున్నా.

భా:—వెతుకుతూంటే నన్ను కలుసుకోలేదేం?

జ్యో:—(చిరునవ్వుతో.) నిజంగా వెతికారండీ.

భా:—(జ్యోతిమాట వినిపించుకోనట్టు మొగుడితో) అయిన ఆలస్యం చాలు. మన మెక్కడున్నామో ముందుగా తెలుసుకోవాలి, ఆవిడ మీతో చెప్పకపోతే.

జ్యో:—నాకే తెలియనప్పుడు నే ఎలా చెప్పను? ఆయన అడగడం మాత్ర మడిగారు సుమండీ. ముందు మీ మాటడిగారు; తరువాతే మాటడిగిగారు.

భా:—(కోపంగా) ఓహో, అలాగా? (మొగుడితో) రండీ మన దారిని మనంపోదాం.

వెం:—సరే పద. (జ్యోతిర్మయితో) వెళ్ళొస్తానండీ.

భా:—(తనూ వెంకట్రావూ వెడుతూండగా) మీకోసం తిరిగి తిరిగి కాళ్ళడిపోయాయి. మీకు చీమకుట్టినట్లైనా లేదు. ఎందు కుంటుంది? ఎవరో ఆవిడ జతపడింది?

[అంటూ ఉభయులూ చీకట్లోకి నడిచిపోతారు]

జ్యో:—సీతారామమ్మగారూ, చూశారా, మొగుడ్ని చెంగునెలా కట్టుకుపోయిందో.

సీ:—దాంట్లో ఏం సుఖం ఉందమ్మా.

జ్యో:—(ఓకిళ్లీ తీసి తన బుగ్గనెట్టి యింకోకిళ్లీ సీతారామమ్మ కివ్వబోతూ) మీరూ తాంబూలం వేసుకుంటారా?

సీ:—వద్దమ్మా, నాదంతాలంతమంచివి కావు. ఇక్కడ కూర్చోడానికేదేనా జాగా ఉందేమో, తిరిగి తిరిగొచ్చాను, నాకాళ్లు పీకడు

తున్నాయి. (చీకట్లోకి నడిచి) ఇక్కడ బాగుందమ్మా, యీ గోడచేరువని కూర్చుంటూ.

జ్యో:—నా మనసిప్పుడు కాస్త కుదుటపడుతూంది. చేతిలో ఉన్నది జారిపోతే విచారంకాని ఏమీలేనప్పుడు విచారమెందుకండీ? సీతారామమ్మగారూ, మీరక్కడున్నారా?

సీ:—ఉన్నానమ్మా, నువ్వు మాటాడుతూ ఉండు. ఎవరేనా మాటడుతూ ఉంటే ఊకొడుతూ వినడం నాకిష్టం.

జ్యో:—ఎవరేనా వింటూఉంటే మాటాడడం నాకిష్టం. ఎప్పుడూ కాదు సుమండీ, అప్పుడప్పుడు మాటాడాలని. నాకు బుద్ధిపుడతూ ఉంటుంది. నేనిలాగో చెప్పేనో లేకో సినీమాలలో పనిచేస్తూ ఉంటానని. సినీమానటి బతుకెలాటిందో మీకు తెలుసండీ?

సీ:—తెలియదమ్మా.

జ్యో:—ఊడిగపు బతుకంటే సినిమానటి బతుకే అనుకోండి. రాత్రన్న మాటలేదు, పగలన్న మాటలేదు, వాళ్ళెప్పుడు రమ్మంటే అప్పుడు వెళ్ళవలసిందే మనం. పదినిముషా లాలస్యంగా వెడితిమా మేనేజరు కళ్ళెఱ్ఱచేస్తాడు. పోనీ పెత్తనంచేసే ఒక్క వెధవేనా వేళకొస్తాడనుకున్నారా? నిక్క నీలిగి వాళ్లు రావడం, వాళ్ళొచ్చాక, ఎవడి కిష్టమొచ్చినట్టు వాడాజ్ఞలు వెయ్యడం. చింపిరి జుత్తుతో రమ్మనేవాడొకడూ, జడదువ్వుకు రమ్మనేవాడొకడూ; ముఖుమల్ డ్రస్సు వేసుకోమనేవాడొకడూ—బనారసుచీర కట్టుకురమ్మనొకడూ, యిలా ఎవడికి తోచింది వాడు పురమాయిస్తూ ఉంటాడు. ఎవడిమాట వినకపోతే వాడికే గుఱ్ఱు-యిందని వెధవలతో వేగుకురావాలి. సినిమా తీస్తూంటే అక్కడికిచేరి-పశువుల్లా, పందుల్లా—నా అవయవాలకేసి చూస్తూ నిలబడేవాళ్ల మాటడుగుతారా...

సీ:—ఉచ్చం నీచం ఒదిలేసిన వాళ్ళ మాటడిగేదేమిటమ్మా.

జ్యో:—మొగాళ్లలా ఏడిస్తే ఏడిచారు, ఆడవాళ్ళకేనా బుద్ధుండొద్దూ? స్టూడియో కప్పుడప్పుడొచ్చే ఆడవాళ్లుంటారు. భోగంవాళ్ళ

కంటె అన్యాయంగా ఒళ్ళు బైటపెడుతూ; మొహాన్ని తట్టెడు పౌడరు పూసుకుని చెంపలు వాయగొట్టిన ట్టెఱ్ఱబారిన బుగ్గలతో, పెదాలకి లక్కా పూతా వేసుకుని—ఏం రోగం వచ్చిందండీ వీళ్ళందరికీని?

సీ:—సుఖమెరగక అలా ఉంటారమ్మా.

జ్యో:—అందుకేనా, ఎవరేనా సుఖపడతూంటే అంతగా ఏడుస్తారు! అయితే మనమిప్పు డెక్కడున్నామండీ?

సీ:—ఏమోనమ్మా, నాకు తెలియదు. కూరలు కొనుక్కుని ట్రాంలో ఎక్కి నే వస్తూఉంటే....

జ్యో:—(అడ్డుతగిలి) నే యీ కంపెనీలో చేరి ఆరునెలలే అయింది. అంతకుముందో ఏడాది కొల్హాపూరులోనూ, తొమ్మిదినెలలు కలకత్తాలోనూ పనిచేశా. ఎక్కడికెళ్లినా సత్రపు భోజనం మఠం నిద్ర—ఈ విధంగా...

[రామమోహన్ ప్రవేశించినందువల్ల జ్యోతి మాటమధ్యలో ఆపేస్తుంది. ఇతను సుమారు ముప్పైఏళ్ల వాడు. ఇతని లక్షణాలు: మాసినబట్టలు; ఎండకీ గాలికీ ఓర్చి మోటుపడ్డ మొహం; ఎదుటివా ళ్లేమనుకుంటారో లక్ష్యంచేయకుండా మాటాడే వైఖరి]

రా:—(జ్యోతికేసి చూసి) ఏం, జగన్మోహినీ.

జ్యో:—(సీతారామమ్మతో) ఏమండోయ్, నన్ను వెంటాడే నరపశు విక్కడికీ వచ్చాడు. ఈ ఘటాలని ఒదుల్చుకొచ్చా ననుకున్నా.

రా:—నీలో నువ్వు మాట్లాడుకుంటున్నావా, జగన్మోహినీ?

జ్యో:—నన్ను జగన్మోహినీ అని పిలవకు.

రా:—నువు జగన్మోహినివి కావూ?

జ్యో:—కానింకీధోరణి కట్టిపెట్టు, నే మాటాడుతున్నది ఆ చీకట్లో కూచున్నావిడతో.

రా:—ఆవిడ చీకట్లో ఎందుకు కూచుందీ?

జ్యో:—అలసట తీర్చుకోడాని కక్కడ కూచుంది. ఆడదానివయితే నువ్వూ ఆపనే చేసేవాడివి.

రా:—ప్రస్తుతం చేస్తూన్నపని - స్టీమరులో మరలు బాగుచెయ్యడం. ఓపనంటూ ఏమిటి? అన్నిటిలోనూ వేలెట్టా, కొన్నాళ్లు రైళ్లునడిపా, కొన్నాళ్లో ఫ్యాక్టరీ యంత్రాలు సరిచేశా. అమెరికాలో ఉన్నప్పుడు - వ్యవసాయపుపని చేసేవాడిని. అన్నిబాపతు పనులూ నేర్చుకున్నా— ఒక్కడబ్బు చేసుకోవడం మినహా.

జ్యో:—అదిమాత్ర మెందుకు నేర్చుకోలేదూ?

రా:— నేర్చుకుందామన్నా, నాకు పట్టుపడందే.

జ్యో:—నువ్విక్కడ కెలావచ్చావ్?

రా:—ఏమో ఎలావచ్చానో. స్టీమరులో మరలు బిగిస్తూ ఉన్నవాడి నిక్కడి కెలావచ్చేనో. స్టీమరు నడిసముద్రంలో ఉంది, ఒడ్డునేనాలేదు. నువ్వెలా వచ్చావ్?

జ్యో:— నే సినీమాలలో పనిచేస్తూ ఉంటూ. డైరక్టరు వెధవతో దెబ్బలాడి, వాడికి పెట్టవలసిన కాస్త గడ్డీ పెట్టి, వీధిని పడ్డా. తరువా తిక్కడి కెలా వచ్చానో. ఆ వెలుతు రేమిటి?

రా:— తెల్లవారుతూంది.

జ్యో:—ఆ గోపుర మేమిటి?

రా:—రంగూన్‌లో యిలాంటిగోపుర మే నే చూశా.

[ఇద్దరూ గోడమెట్లెక్కుతూ ఉంటారు. సీతారామమ్మ నిద్రపోతూఉంటుంది]

జ్యో:—( నెమ్మదిగా ) చూశావా, సీతారామమ్మగారు నిద్దరోతూన్నారు.

రా:—పాపం, ఎంతలసిపోయిందో.

[ఇద్దరూ గోడమీద నిలబడి అవతలవేపు చూస్తూఉంటారు. సగం చీకటీ సగంవెలుతురుగా ఉంది]

జ్యో:—ఇదేమేనా కోటగోడేమో?

రా:—అవొచ్చు. ఊరిచుట్టూ గోడేనా అవొచ్చు. చైనాలో యిలాంటిగోడలే ఊరుచుట్టూ కడుతూ ఉంటాయి. నేనక్కడున్నప్పుడొకసారి చూశా.

జో:— నేనూ చూశా సినిమాలలో.

రా:—(క్రిందకు చూస్తూ) ఏదీ సరిగా అనడం లేదు. కిందకి చూస్తే మాత్ర మగాధంలా ఉంది. ఇంక ముందుకి దారిలేదు.

జో:—(క్షణమాగి) చూడు - నిన్ను నే 'రాం' అని పిలవొచ్చా?

రా:—అభ్యంతర మేమిటి, జ్యోతీ.

జ్యో:—(తాపీగా) రాం, యీ దిగువ నేదైనా చిత్రమైనఊరుం దేమో?

రా:—చిత్రమైన ఊరంటే?

జ్యో:—అంటే...సరిగా చెప్పలేను కాని...నే చూసిన మద్రాస్, బొంబాయి, కలకత్తాలలాంటిది కాని ఊరు.

రా:—నే చూసిన లండన్, టోకియో, న్యూయార్కులలాంటిదీ కాకుండా.

జ్యో:—(తాపీగా) వాటన్నిటికీ భిన్నమైన ఊరు. అలాంటి ఊరు చూస్తానని నే చిన్నప్పటినుంచీ అనుకుంటూ వచ్చా. అవతల సిద్ధంగా కట్టున్న ఊరు. మనం లోపల ప్రవేశించడమే తరువాయి, నే యిలా చెప్పను నువ్వు నవ్వుతున్నావ్.

రా:—వేళాకోళానికి కాదు జ్యోతీ. స్నేహభావంతో నవ్వా.

జ్యో:—అయితే సంతోషమే. ఈ ఊరికీ మిగతా ఊళ్ళకీ-ఎగతాళికీ స్నేహానికీ ఉన్న వ్యత్యాసముండాలి.

రా:—నువ్విలా ఉత్సాహంగా మాట్లాడుతుంటే ఎవరో కవి వ్రాసింది జ్ఞాపకమొస్తూంది. ఆయన వ్రాసినది. చెబుతా విను "కలలో నేనో మహాపట్నం చూశా. ఎంతో స్నేహంగా బ్రతుకుతున్నారా ఊళ్లో వాళ్ళు, మిగతా వాళ్ళందరూ ఏకమై ఆ ఊరిని నాశనపర్చకుందామని చూశారు. కాని ఎవరికీ వశం కాకుండా, ఎక్కడా తక్కువ కాకుండా ఆఊరు నిలిచుంది."

జో:—కవి వర్ణించిన ఊరెక్కడో ఓ చోటుండి, రాం.

రా:—కలలో చూశానన్నాడు కాని నిజంగా అలాంటి ఊరుందని నెలానమ్మడం?

జో:—ఉంది. రాం, అలాంటి ఊరు చూస్తానని నాకు పూర్తిగా నమ్మకముంది. అక్కడికివెళ్ళి ఉండిపోదామనికూడా అనుకుంటూ వచ్చా. నే ఏఊళ్లోనూ స్థిరంగా ఉండకపోయింది చివరకా ఊరుచేరుకుందా మనేమో!

రా:—(ఉభయులూ మెట్లుదిగుతూండగా) పోని కాని, "శంతా" అనెప్పుడేనా నిన్ను నువ్ పిలుచుకున్నావా?

జ్యో:—పిలుచుకున్నా కాని ఆ పేరెట్టి నువ్వుపిలిస్తే ఒప్పను సుమా.

రా:—నిన్ను పిలవడం మాటకాదు — నన్నే నే పిలుచుకున్నా. "శంతా" అని - ఎన్నోసార్లీ పదిహన్నెండేళ్లలో.

జ్యో:—నీకంత వయసెక్కడుంది?

రా:—నాకేం తక్కువ వయస్సుందనుకున్నావా - ముప్ఫైఒకటి నిండాయి.

జ్యో—నిండితేనేం? పోనీ, నా వయసెంతో చెప్పుకో.

రా:—పందొమ్మిది, తప్పితే ఇరవై.

జ్యో:—నా మొహంమే చెప్పడంలే పాతికేళ్లున్నాయని? ఇప్పుడలిసిపోయున్నాననుకో. లేకపోయినా—నే తిన్నఢక్కాముక్కాలతో లావణ్యం చెడుండేమో మొహం.

[ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటారు]

రా:—నీ మొహానికే లోపమూలేదు, జ్యోతీ.

జ్యో:—(మాట మళ్ళించడానికి) సరేకాని, అక్కడా తలుపేమిటి?

రా:—చూద్దాముండు (ఇద్దరూ తలుపుదగ్గరకు నడిచివెళ్ళి దాన్ని పరిశీలిస్తారు) ఈ గోపురం నగరరక్షణకి కట్టుండాలి సుమా. ఈలాంటి గోపురాలే పూర్వకాలం.

జ్యో:—(ఆశ్చర్యతగిలి) పూర్వం కట్టిందంటావా యీ గోపురం?

రా:—పూర్వంకట్టిన దానిలాలేదు. కొత్తగా కట్టినట్టే ఉంది. ఈ తలుపు మూగట్టితలుపు. ఓ పట్టాన్ని దీన్ని పగలగొట్టలేం.

జ్యో:—ఏం?

రా:—(వేలుమడిచి తలుపునికొట్టి ధ్వనిచేస్తూ) ఇదేదో కొత్తమూనిరి లోహంతో చేసినట్టుంది. ఇనుమూ కాదు, ఉక్కూ కాదు. అల్యూమినియం బ్రాంజే అనుకుంటా, లేకపోతే యీ పైమెరుపురావడం కష్టం.

జ్యో:—(నవ్వుతూ) ఉన్నట్టుండి యీ తలుపునిగురించి లెక్చరివ్వడం మొదలుపెట్టావు, దీన్ని నువ్వే తయారుచేసినట్టుగా, మీ మొగాళ్ళు మోస్తరే అంత.

రా:—(జ్యోతి మొహంకేసి చూసి) మొగాళ్ళసంగతి నీకేం తెలుసు?

జ్యో:—(రామమోహన్ కేసి చూస్తూ) చాలా తెలుసులే.

రా:—అలాగా?

జ్యో:—(మొహం ఎత్తే) నావాళ్ళ కూటికీ గుడ్డకీ వాచి బాధపడుతూంటే, పదహారో ఏట నేయిల్లొదిలేశా. దాసీపనిచేసి కొన్నాళ్ళు పిల్లల్నెత్తుకు మోశా. ఆ వెనుక ఫిలుం కంపెనీలలో చేరా. ఈ కంపెనీలలో దినదినగండం నూరేళ్ళాయుషు - అన్నట్టు వెడుతూంది. నా బతుకు. ఏదో మనస్తాపంలేకుండా ఒక్కరోజేనా గడిచిందనుకున్నావా? మధ్యనెప్పుడేనా కొంత సుఖం దొరికితే - మొగాళ్లతో అను ఇంకొకటను-- దాన్నీ నే వదిలిపెట్టలే.

రా:—నీచరిత్ర నాతో ఎందుకు చెపుతున్నావ్?

జ్యో:—ఏమో నీతో చెప్పాలని బుద్ధిపుట్టింది.

రా:—నాకు వినాలన్న కుతూహలంలేదే?

జ్యో:—అలాగా?

రా:—పోనీ నువ్వు నమ్మకపోతే.

[అని తలుపుదగ్గరకు వెళ్ళి గట్టిగా బాదుతాడు ; ఈ చప్పుడికి సీతారామమ్మ ఉలిక్కిపడి లేస్తుంది]

సీ:—నన్నదరగొట్టావు, నాయనా.

రా:—పొరపాటు పిన్నీ, క్షమించు.

సీ:—ఎందుకలా తలుపు కొడుతున్నావ్?

రా:—మనం యిక్కడున్నట్టవతలవాళ్ళకి తెలియబరచొద్దూ.

[తలుపెవరేనా తీస్తారేమో అని చూస్తాడు]

సీ:—నువ్ తలుపుకొట్టేం లాభంలేదు. దానికి బుద్ధిపుట్టి అది తెరుచుకోవాలి కాని. మన ప్రయత్నంవల్ల దాన్ని కదపలేం.

రా:—నీకెలా తెలిసింది, పిన్నీ ?

సీ:—నాకు తోచిన ముక్క చెప్పా, నమ్ము, నమ్మకపో. ఇంటిదగ్గర మావాళ్ళూ నమ్మరు, నే యిలాంటివి చెపితే. క్రియకి నే అన్నట్టే జరగడమూ చూశా.

జ్యో:—నాకూ రాబోయేది కళ్ళకి కట్టినట్టగుపడుతూంటుందండీ, అప్పుడప్పుడు.

రా:—జ్యోతిష్యం తెలిసిన మీాయిద్దరి మధ్యా నే చిక్కుకున్నానన్నమాట.

సీ:—మేం యిద్దరమే అనుకున్నావా యిక్కడున్నది? రొంపరొంపలాడే భాగ్యేశ్వరీ, భాగ్యేశ్వరీ మొగుడూ; గుజ్జుపుపందాల విశ్వేశ్వరరావూ; లావుపాటావిడా, ఆవిడ కూతురూ; వాళ్ళతో వెళ్ళిన పొట్టాయనా—యిందరం యిక్కడున్నాం.

రా:—అయితే ఓ మీాటింగుకు సరిపడ్డంతమంది వున్నాం.

సీ:—అడుగో. ఆ పొట్టయనొస్తున్నాడు చూడు, ఎవర్ని బుట్టలో పడేదామా అనే వాలకం తోనూ.

[చెమట కార్చుకుంటూ ఎఱ్ఱబారిన మొహంతో శ్రీకాంతయ్యొస్తాడు.]

శ్రీ:—ఈ చుట్టుపక్కల పోస్టాఫీ సెక్కడుందో మీా కెవరికేనా తెలుసా ? (జ్యోతిర్మయి నవ్వాపుకోలేక విరగపడి నవ్వుతుంది. సీతారామమ్మా, రామమోహన్ కూడా నవ్వుతారు) ఏమిటా వేళాకోళం వెక్కిరింపూ ? ఎందుకు నవ్వుతున్నారూ ?

జ్యో:—(నవ్వడం మానేసి) ఏమీా అనుకోకండి. మీారక్కడొగురుస్తూ నిలబడి పోస్టాఫీసు భోగట్టా అడుగుతూంటే నే ఆపుకుందామని చూసినా నవ్వాపుకోలేక పోయా.

శ్రీ:—ఏదో అర్థంలేని నవ్వు. పోనీకాని, మీా కెవరికేనా పోస్టాఫీసు భోగట్టా తెలుసా ?

రా:—మీకు పోస్టాఫీసెందుకండీ ?

శ్రీ:—రెండు టెలిగ్రాములు పంపిరావాలయ్యా.

రా:—రెండూ అర్జంటు టెలిగ్రాములేనా !

శ్రీ:—అవు నర్జంటు టెలిగ్రాములే, వ్యాపారం- ఏం, మజాకాలను కున్నావా ఏమిటి ?

రా:—ఓహో, మీరు వ్యాపారస్తులా ? మీరు పొద్దస్తమానూ చేసే పని ధనాకర్షణా ?

శ్రీ:—అవునయ్యా, ధనాకర్షణే.

రా:—ఎందుకీ ధనాకర్షణ? డబ్బులేక మీ రిబ్బందిపడుతున్నారా?

శ్రీ:—నాకా, డబ్బులేక పోవ ? నే తలపెట్టిం దింకొకటి.

రా:—ఏమిటండి ?

శ్రీ:—క్రాసుచేసి నన్ను పడగొడదామని చూస్తున్నావా ? నీ తల తన్నిన వాళ్ళకి లొంగలేదు, నీకు లొంగుతానా ? అయినా చెపుతా విను. నేనో పెద్ద వ్యాపారం మొదలుపెట్టా. అది లక్షలూ కోట్లమీద వ్యాపారం. అందులో నే నెగ్గుకొచ్చిననాడు శ్రీకాంతయ్య కందరూ బ్రహ్మరథం పడతారు. పెక్కున వ్యాపారస్తులు - నా పాదక్రాంతు లౌతారు. ఆ వ్యాపారం కోసం నేయీ రెండు టెలిగ్రాములూ పంపి రావాలి.

సీ:—నే చెప్పలేదు; ఒకళ్ళిబ్బళ్ళు లోకళ్ళకు మార్చే చెయ్యాని ?

శ్రీ:—(ఇది పొగడ్తనుకుని) నాలో యీ ఘనతుండబట్టే యింత వాడి నయ్యాను. (తలుపు చూసి) ఎదురుగుండా తలుపుంటూండగా నోసుకు ప్రవేశించ కిక్కడ నిలబడ్డానేం ?

[తలుపుదగ్గరకు వెళ్ళి కొడతాడు]

రా:—ఆ తలుపు రాదయ్యా, నే కొట్టిచూశా.

శ్రీ:—(గోపురాన్నిచూస్తూ) ఇలాంటి గోపురమే యింకొకటుంది సమీపంలో, ఇందాకా, ఆ తల్లీ కూతుళ్ళతో వెళ్ళినప్పుడు నే చూశా. ఎంతసేపూ ఆ తల్లికి కావలసినది జమీందార్ల భోగట్టా, యింకో ప్రపంచ

మావిడికిలేదు. ఎవరో రాజాబహద్దు రక్కడ బైలపడితే వాడితో యీ ప్రస్తావనే మొదలెట్టింది. (క్షణమాగి, ఓరాకుగా) మనమిక్కడ కూచుని ఏం జేస్తున్నట్టు ?

సీ:—నే అలసట తీర్చుకుంటూ కూర్చున్నాను.

శ్రీ:—(సీతారామమ్మతో) ఉత్తప్పుడు ఎప్పుడూ యిలా కూర్చోవుగా ? నువ్వేం పని చేస్తూ ఉంటావ్ ?

సీ:—పొద్దుగూకా యింట్లో వాళ్ళకి చాకిరీ, పైన శ్రీమంతుల యిళ్ళలో చాకిరీ.

జ్యో:—ఎందుకయ్యా నీకావిడ భోగట్టా ?

శ్రీ:—అది తరువాత చెపుతాకానీ, పట్టుమనారునెలలు నువ్వోచోట పనిచేశావూ ?

జ్యో:—నా గొడవెందుకు నీకు, నీ సంగతి నువ్ చూసుకో.

శ్రీ:—(నవ్వుతూ) నే వ్యాపారస్తుడిని. అందరిగొడవలూ నాక్కావాలి.

రా:—(ఇంతసేపూ శ్రీకాంతయ్యని కనిపెడుతూ ఉండి) చూడు, నువ్ మొదట్లో చిన్న గుమాస్తాగా ప్రవేశించావ్, ఆరోజు లగాయితు-అవకాశం దొరికినప్పుడల్లా ఎదుటివాళ్ళ కళ్ళల్లో దుమ్ముకొట్టి నీ జేబు నింపుకుంటూ వచ్చావ్. ఇలా లక్షలు పోగుచేశావ్, వ్యాపారస్తుడవయ్యావ్. ఇదీనా నీ జీవిత సంగ్రహం.

శ్రీ:—(ఇది పొగడ్తగా తీసుకుని) నువ్వు చెప్పింది మూడొంతులు నిజం. అయితే నువ్వెవరు ? నీ వైఖరీ చూస్తే ఏదో మరలపనిచేసే వాడిలా ఉన్నావ్ ?

రా:—అవును, మరల పనిచేసే వాడినే.

శ్రీ:—ఈవేళక్కడ పనుంటే - రేపక్కడుంటుంది ? అంతేనా ?

రా:—అవునంతే.

శ్రీ:—ఆఖరి కెక్కడికి చేరుకున్నావ్ ?

రా:—ధనాకర్షణచేసి నువ్వెక్కడికి చేరుకున్నావ్ ?

శ్రీ:—నా దగ్గ రెంత డబ్బుందో చెప్తే, నువ్ నిర్ఘాంతపోతావ్.

రా:—నిర్ఘాంతపోతానా? నిన్నింకా నిర్లక్ష్యంగా చూస్తా.

జ్యో:—ఎందుకు రాం, అతన్ని తూలనాడతావ్ (సీతారామమ్మతో) ఏమండీ, యితనొకళ్ళని తూలనాడే మనిషా?

సీ:—కాదమ్మా!

రా:—(నవ్వుతూ) ఏమిటీ నన్ను గురించి మీరిద్దరూ వ్యాఖ్యానం చేస్తున్నారు? (శ్రీకాంతయ్యతో) ఏమయ్యా, ఆడవాళ్ళతో నువ్వెప్పుడేనా సంబంధం పెట్టుకున్నావా?

శ్రీ:—ఒకటి రెండు సార్లు కాలుజారినా, వాళ్ళని తప్పించుకు తిరుగుతూ ఉంటా.

జ్యో:—పాపం కాలు జారినప్పుడు మీరు గట్టిదెబ్బ తగిలిందికాబోలు.

శ్రీ:—తగిస్తే నే లక్ష్యపెట్టానా? ఆడవాళ్ళకి చేరికిస్తే అన్ని పనులూ మానేసి వాళ్ళ వెంటే తిరగమంటారు!

జ్యో:—అప్పుడు నీ వ్యాపారాని కంతరాయం వస్తుంది!

శ్రీ:—వాళ్ళ హద్దులో వాళ్ళుంటారా? అన్నీ మాకే కావాలంటారు. అన్ని కలగాపులగం చేసి పెడుతూ ఉంటారు.

జ్యో:—(కోపంగా) కలగాపులగం చేసి పెడుతూ ఉంటారా?

రా:—కోప్పడకు. ఇతనిమాట పూర్తిగా కొట్టెయ్యడానికి వీల్లేదు.

శ్రీ:—అనుభవ మున్నవాడివి నువ్ చెప్పు. ఎన్నిసార్లాడవాళ్ళ మూలకంగా - నీ డబ్బంతా ఖర్చయి, అక్షరమాలిన తగువులు నీ మెడకి చుట్టుకుని ఆఖరికి నీ పనికూడా పోయి నువ్వు బాధపడలేదు.

రా:—(నవ్వుతూ) బాధే లేనేమను. నాకా అనుభవముంది.

శ్రీ:(జ్యోతితో) ఏం, నేను చెప్తే కొట్టిపారేశావు.

జ్యో:—(సగం కోపంగా, సగం వెళాకోళంగా, రామమోహన్‌తో) జగన్మోహినీ అంటూ నువ్ ప్రవేశించినప్పుడే నీ వాలకం నే కనిపెట్ట వలసింది. కనిపెట్టాను కూడాను. (సీతారామమ్మతో) ఏమండీ అప్పుడే మీతో చెప్పలేదూ యిత నేలాంటివాడో?

సీ:—చెప్పావమ్మా (రామమోహన్ వేపు చూసి) అయినా ,యితను మంచివాడే. కల్మషంలేని మనిషి.

రా:—పోనీ, పిన్నీ, నువ్వేనా మంచి మాటాడావు.

[లావణ్య ప్రవేసిస్తుంది]

లా:—ఏమండోయ్, శ్రీకాంతయ్యగారూ, యీ గోడ అవతలో మహాపట్నముంది.

శ్రీ:—ఇందాక చూసినప్పుడు నాకేం కనపడలేదే ?

జ్యో:—(ఉత్సాహంతో) ఏమిటిక్కడ పట్నముందా ? వెళ్ళి చూద్దాం రండి.

[జ్యోతీ మిగతావాళ్లూ గోడెక్కి చూస్తారు. సీతారామమ్మ కిందనే ఉంటుంది. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు]

లా:—ఆహా, ఏమందమయిన ఊరు ! ఎంత చక్కటి భవనాలు !

జ్యో:—(ఉత్సాహంతో) అవును, పొగమంచు కప్పునాన్నా ఊరాకార మంతా కనపడుతూంది. ఏం రాం ?

రా:—నాకేమీ ఆనడంలేదు.

లా:—నువ్వు సరిగా చూడక....

శ్రీ:—(మాట కడ్డొచ్చి) నే చూస్తున్నా గుడ్లు నిలవతీసుకుని, నా క్కనపడిన దేముందీ ? పొగమంచు తప్ప విడిస్తే ఏముందీ ? ఆ మంచు కిందేముందో ఏం చెప్పం ?

లా:—ఆ ఊరుమధ్య సరస్సు, పక్కనే గోపురం గోపురంమీద ఎవరో ఆయన విగ్రహం - అన్నీ కనపడుతూంటే నే ? లేదంటారేం ?

జ్యో:—(వెంకట్రావు, భాగ్యేశ్వరి వస్తారు.)

వెం:—(ప్రవేసిస్తూ) నే ఏమన్నా తప్పుపడతావుకాని దారితప్పి తిరుగుతూ వాదించుకునేం లాభం ?

భా:—పోనివ్వండి, నెల్లూరు ప్రయాణం నేనా తలపెడత ?

వెం:— నువ్వు కాకపోతే యింకెవరు ? మీ మామయ్యుత్తర మొచ్చాక, నన్నోనిముషం నిల్చోనిచ్చావా ? షాపుకెళ్ళి చీరలు తెమ్మనీ, మామయ్య పిల్లలకి బొమ్మలు తెమ్మనీ...

భా:—(తలుపుకేసిచూసి) చూడండిక్కడేదో తలుపుంది. బోడిగా ఎలా ఉందో. పట్టుకుతోయ్యాలన్నా కొంక్కేమైనా లేదే.

వెం:—ఉంటేమాత్రం, లోనుకెలా ప్రవేసిస్తాం, లోపలివాళ్లె నెరగనప్పుడు ?

భా:—కొత్తదారి చెప్పమనడగడానికి వాళ్ల నెరుగుండడ మెందుకూ?

వెం:—ఓ వేళింకా వాళ్లు నిద్రపోతూంటే ?

భా:—మీరు చేతకాకపోతే నేతలుపు కొడతా నుండండి.

వెం:—(ముందుకు నడుస్తూ) నాకేం భయమనుకున్నావా ? ఎందుకు నేనే కొడతాలే.

రా:—(గోడమీదనుంచుని) ఆగన్నా ఆగు. ఇంత సేపటినుంచీ మేం కొట్టిచూశాం, ఏం ఉపయోగంలేక పోయింది.

వెం:—ఆయనమాటలు విన్నావా భాగ్యం ?

భా:—(యీసడింపుగా) విన్నా, వినకేం ?|

[అని తలుపు దగ్గరకువెళ్ళి దబదబ బాదుతుంది. తలుపెప్పట్లాగే ఉంటుంది.]

వెం:—(భార్యతో) మొదటిలో ఆయన చెప్పినమాట వింటేనో ?

భా:—ఊరుకోండి బాబూ నన్నెందుకు వేపుకు తింటారు ?

జ్యో:—(వెంకట్రావుతో) ఈ గోడవతలో ఊరున్నట్టుందండోయి !

వెం:—ఏవిటీ, అక్కడో ఊరుందా ?

జ్యో:—కావాలంటే వచ్చిచూడండి.

[వెంట్రావు పెళ్ళాం అనుమతికోసం ఆవిడకేసి చూస్తాడు. భాగ్యేశ్వరి మొగుణ్ణి మింగేద్దామా అన్నంతకోపంతో అతనికేసి చూస్తుంది.]

భా:—(కోపంగా) చూడాలంటే వెళ్ళిచూడండి. ఎవరొద్దన్నారేం?

వెం:—రా, భాగ్యం రా, మనిద్దరం వెళ్ళిచూద్దాం.

భా:—ఈ చీకట్లో చూసేదేముందీ ?

లా:—చీకటేమిటి తెల్లవారుతూంటే. మేం చూడ్డంలే ? మీరూ చూద్దురుకొని రండి.

భా:—మాచాశావ్ నువ్వన్నీ.

లా:—నువ్వెప్పుడూ ధుమధుమలాడతూ ఉంటావేం ?

భా:—ఏమిటీ నువ్వంటూంటా ?

శ్రీ:—(తానూ మిగతావాళ్లూ కిందకి దిగుతూండగా) ఆ అమ్మాయి అడుగుతూన్నది, నువ్వెప్పుడూ ధుమధుమలాడతూ ఉంటావేమని. నువ్వెవరో నే ఎరగనుకాని...

వెం:—నా భార్య భాగ్యేశ్వరండీ, నా పేరు వెంకట్రావు.

శ్రీ:—నా పేరు శ్రీకాంతయ్య, మీ కాపురమెక్కడ ?

వెం:—త్యాగరాయ నగరంలో, నే అక్కడ స్వతంత్రభారత బాంకి మేనేజరునండి.

శ్రీ:—ఏవో యీమధ్య చాలా బాంకులొచ్చాయి.

లా:—మనమంతా మతులుపోయున్నామేమో అని నాకనుమానంగా ఉంది.

శ్రీ:—ఏమిటి ? నేమతి పోయున్నానా ? చుట్టూ ఏం జరుగుతూందో నాకవగాహన కాకుండా ఉందికాని.

లా:—కొత్త జాగాకొచ్చినా ఎంతో ఉత్సాహంగా ఉందినాకు—ఏదో గొప్ప విశేషం జరుగుతుందనిపిస్తూంది.

జ్యో:—(మనః పూర్వకంగా) నాకు అలాగే అనిపిస్తూంది.

[ఉభయులూ ఒకళ్ళనొకళ్ళర్థం చేసుకున్నట్టు చూసుకుంటారు.]

లా:—నువ్వూ... ప్రపంచం చాలా... చూసినదానిలా ఉన్నావే ?

జ్యో:—(సగంవేళా కోళంగా, సగం ఉద్దేశ పూర్వకంగా) ఏమిటి నువ్వంటూన్నది ?

రా:—(మధ్యకొచ్చి) నాకు తెలుసాపిల్లేమంటూందో.

జ్యో:—(కోపంగా) నీకేం తెలియదు. నువ్వవతల కెళ్లు.

లా:—నే మన్నుతిన్న పాములా యింట్లో పడుండమేకాని ఎక్కడికీ వెళ్ళిందీలేదు, ఏం చూసిందీలేదు.

రా:—ఇంట్లో ఎందుకు పడుండాలి ?

వి:—రాఘవపురం జమీందారుకి. రాఘవపురం జమీందారంటే ఎవరనుకున్నారు ? సాక్షాత్తూ మా మేనమామ.

మ:—అలాగటండీ ? ఎప్పుడో కాని పెళ్ళాంవూసే ఎత్తడండీ.

వి:—మా మేనమామ ఎంతసేపూ కుక్కల్ని పెట్టుకు కూర్చుంటాడు. ఆయనదగ్గర ఎన్నికుక్కలున్నా యనుకున్నారు! పసుపురంగు కుక్కలూ, ఎద్దుమూతి కుక్కలూ, ఎలకమూతి కుక్కలూ - యివీ అవీ అన్న మాటేమిటి - ప్రపంచంలో ఎన్ని కుక్కల జాతులున్నాయో - అన్ని జాతుల కుక్కలూ మామయ్య దగ్గరున్నాయండీ. ఈ కుక్కల్ని ఎంత శ్రద్ధగా చూస్తాడనుకున్నారు ! వీటన్నిటికీ దగ్గరుండి తిండిపెట్టించి, నీళ్ళు పోయించి, షికారుకి తీసుకెళ్ళి, దేనికేనా రోగమొస్తే తనపక్కలో పడుకోపెట్టుకుని కడుపున పుట్టిన పిల్లలకంటె ఎక్కువగా చూసుకుంటాడండీ.

మ:—రాజా సోమసుందరం చెట్టిని మీరెరుగుదురా ?

వి:—మాగిండీక్లబ్బు మెంబరేగా అతను.

శ్రీ:—కార్ల వ్యాపారస్థుడు సోమసుందరం చెట్టేనా ?

వి:—అతను కాదయ్యా, యితను రాజా సోమసుందరంచెట్టి. మీరెవరు వ్యాపారస్థులా ?

శ్రీ:—అవును, నా పేరు శ్రీకాంతయ్య. మీరెవరు ?

వి:—నేనో జమీందారుని. నా పేరు రాజాబహద్దుర విశ్వేశ్వరరావు. వ్యాపారస్థులతోనూ నాకు కొంత సంబంధముంది. కొందరు కంపెనీ వాళ్లు నా దగ్గరకొచ్చి, "మీ పేరూ మా కంపెని డైరక్టర్లలో వేసుకోనివ్వండి. రాజాబహద్దూర్లూ దివాన్ బహద్దూర్లూ మా డైరక్టర్లుగా ఉన్నారంటే మా కంపెనీ ఎంతో గొప్పదని ప్రజలనుకుంటారు. మీకూ తగ్గట్టు ముట్టచెపుతాం" అని బతిమాలారు. మన సొమ్మేం పోయింది ? వేసుకోండన్నా.

మ:—లావణ్యా, మన పక్కగదిలో దిగారా కొండపల్లి రాజా కూతుళ్లు. అందులో పెద్దది మొగుడ్ని వదిలేసిందట. రాజాబహద్దూర్ కి వాళ్ళ పుట్టుపూర్వోత్తర మంతా తెలుసు.

లా:—ఏం చేసింది ?

భా:— మొగుడేం వేళ్ళకుతిన్నాడో ?

వెం:—(భార్యని వారిస్తూ) భాగ్యం.

[మహాలక్ష్మమ్మ పెదమొహం పెడుతుంది]

వి:—శ్రీకాంతయ్యగారూ, యిప్పుడే కంపెనీలలోనండీ మంచి లాభ మొస్తూ ఉంటే?

శ్రీ:—టీ కంపెనీలలోనండీ.

రా:—కొన్నాళ్లు నేనో టీ కంపెనీవాళ్ళ కింద పనిచేశా. అక్కడ కూలీల బతుకుకంటె యమలోకమేనా నయమే.

వి:—ఎవరయ్యా నిన్నడిగారు ?

రా:—నీతో ఎవరయ్యా చెప్పారు !

వి:—(శ్రీకాంతయ్యతో) టీ కంపెనీ వాటా లిప్పుడింకా అమ్ముతున్నారండీ ?

శ్రీ:—సులువుగా డబ్బుచేసుకునే సూత్రమేనా మీకు కావలసింది ?

వి:—అవునండదే.

శ్రీ:—నాకా సూత్రం తెలుసు.

సీ:—పోస్టాఫీ సెక్కడుందో ఎరగవుకాని ఆది నెలలు సిరిసెలుగుంటావ్.

శ్రీ:—అవకాశం దొరికిందనా నీ పొడుపు ?

రా:—నువ్వో చిత్రమైన మనిషివి, సిన్నీ.

సీ:—(శ్రీకాంతయ్యతో) నీలాంటి వాళ్ల యిళ్ళలో చాకరీ చేసి చేసి నాచేతు లరిగిపోయాయి. ఎంత చేసినా ఓ మంచిమాట అడినవాళ్లు లేరు కదా. ఎంతసేపూ కూచుని చేయించుకోడమే నీకొచ్చు. నీ వంటి నీడ కాపర మెక్కడో చెప్పు నువ్వు చూద్దాం.

శ్రీ:—ఆచారప్పన్ వీధిలో మాడో నెంబరింట్లో - మా ఆఫీసులో పనిచేసేవాడు గోపాలం - అతని పెళ్ళామే గా యీవిడ. గోపాలం పోయాకే యీవిడ వంటపని ప్రారంభిస్త. మొన్నరాత్రి గోపాలం నాకు కలలో కనిపించాడు కూడా.

వి:—కలలంటే జ్ఞాపక మొచ్చింది, లక్ష్మింపురం జమీందారుకో చిత్రమైన కలొచ్చేది - అడవిలో తాను నడుస్తూన్నట్టూ, గాండ్రు గాండ్రుమని ఓ పెద్దపులి తన్ని తీసుకుపోతూన్నట్టూ - యీ కలే మళ్ళీ మళ్ళీ వచ్చేది. ఎందుకొస్తాయో యీ కలలు ? .....మహాలక్ష్మమ్మగారూ, యిక్కడ కూర్చు నేం చెయ్యాలి, కొన్నేపు తిరిగొద్దా మొస్తారా ?

మ:—అలాగే. ఏం లావణ్యా, కదలవేం ?

లా:—నాకు రావాలని లేదమ్మా.

మ:—నే రమ్మని చెపుతూంటే.

లా:—నే రానమ్మా, నువ్వు వెళ్ళు.

[ఇద్దరూ బలాబలాలు చూసుకోంటూన్న ట్టొకళ్ళ కేసొకళ్ళు చూస్తారు. సూర్యోదయ మయింది. ఊళ్లో భవనాలు సూర్యరశ్మిలో మెరుస్తూన్నందు వల్ల నేమో అటువేపు నుంచి సువర్ణకాంతులు వెలువడుతున్నాయి. జ్యోతి గోడెక్కింది. మిగతావాళ్ళు దిగువనే ఉన్నారు]

జ్యో:—(ఉత్సాహంతో) ఓ నరమానవుల్లారా ! ఈ మహా పట్నాన్నొచ్చి చూడండి.

[లావణ్య, రామమోహనులు మెట్లెక్కుతారు. తరువాత శ్రీకాంతయ్య, ఆ వెనుక భాగ్యేశ్వరి, వెంకట్రావు, చివర మహాలక్ష్మమ్మ, విశ్వేశ్వరరావు మెట్లెక్కుతారు. అందరూ గోడమీద నిలబడి ఊరికేసి చూస్తూ ఉంటారు. దూరాన్నుంచి భేరీమ్రోత వినపడుతుంది]

వి:—ఏరో మహా డాబుగా ఉందీ ఊరు.

జ్యో:—ఎంతెంతవైన ఊరో !

వి:—దీన్ని చూస్తూంటే పార్కుషోయిలు నాకు జ్ఞాపక మొస్తోంది. ఆ తమాషా బొమ్మలూ, ఆ రంగులగటాలూ అవన్నీ.

లా:—(అడ్డొచ్చి) పార్కుషోయికీ దీనికీ ఎక్కడా పోలికలేదు.

జ్యో:—(ఆదుర్దాగా) రాం, నువ్వేమంటావ్ ?

రా:—(నెమ్మదిగా) ఏమో, ఏం చెప్పం ?

జ్యో:—(చిరాకుగా) కళ్లెదుటుందిగా, చెప్పలేకేం ?

రా:—ఇలాంటి ఊళ్లు నే యిదివరకూ చూశా. సముద్ర ప్రయాణం చేసి చేసి ఓడ ఊరు చేరుకోబోయే ముందు-దూరాన్నుంచి ఎంతో అందమైన ఊరులా కనపడేది. ఊళ్లో అడుగెట్టా కెప్పా దొడిలిపోతామా అని పించేది. ఇంటిపేరు కస్తూరివారూ, యింటినిండా గబ్బిలాల కంపు.

జ్యో:—నిన్ను కంపులమారి వెవరడిగారు ?

రా:—ఉదాహరణకన్నా. నే చూసిన ఊళ్లు - పైకందంగా కనపడ్డం; ఊళ్లో మూడొంతులమంది తిండికి మొహం వాచి, శల్యావశిష్టులై, చింకిగుడ్డలు కట్టుకు తిరుగుతూండడం; అక్కడ పిల్లలు చింపిరి తలల వాళ్లూ, చీమిడి ముక్కులవాళ్ళూ, రసికారుతూన్న కురుపుల వాళ్ళూ—

లా:—(గుసుక్కుమని) చాల్లేవయ్యా ఎదుటున్నది చూడ్డం మానేసి.

రా:—నాకు తెలియాకు మొఖ్ఖో అంటే, యిారేనన్ను రేపెట్టాను.

లా:—(జ్యోతితో) ఇతను చూపినలాంటిది కాదిది. నువ్వేమంటావ్ ?

జ్యో:—ఇదలాంటిది కానేకాదు.

వెం:—భాగ్యం నువ్వేమంటావ్ ?.

భా:—ఏదో చిత్రమైన ఊరులా ఉందండీ.

వెం:—మనకిది సరిపడుతుందంటావా ?

సీ:—(క్రింద కూర్చుని) నాకు సరిపడుతుంది.

రా:—పిన్నీ, నువ్వు ఊరు చూడనేనా లేదే, ఎలా చెప్పగిలవ్ ?

సీ:—నాకు తోచినముక్క చెప్పడానికి, ఊరు చూడాలా ఏమిటి ?

జ్యో:—ఆ ముక్క పూర్తిగా చెప్పండి, సీతారామమ్మగారూ.

సీ:—అంతేనమ్మా ! ఇంకేం చెప్పవలసిందిలేదు.

[అందరూ ఆవిడకేసి చూస్తారు. మళ్ళీ ఊరుకేసి చూస్తూ ఉంటారు.]

మ:—చిన్నప్పుడోసారి నే ఉదయగిరివెళ్లా.. ఒక్కర్తెనూ... యాభైమైళ్ళు బస్సు ప్రయాణం చేశా...ఈ ప్రక్కా ఆ ప్రక్కా అడివి...ఉదయగిరి కొండశిఖరాన్నుంది...ఆ ఊళ్లో మా స్నేహితురాలుండేది...ఇద్దరం ఓ యీడువాళ్ళం...పదమూడు పద్నాలుగేళ్ళ

వాళ్ళం...ఆ అమ్మాయీ నేనూ కలిసి ఆచుట్టు ప్రక్కల కొండలన్నీ ఎక్కిచూశాం. ఆ పదిరోజులూ మాసరదాగా గడిచిపోయాయి.

లా:—(తల్లికేసి ఆశ్చర్యంగా చూస్తూ) అమ్మా, నాతో ఎప్పుడూ యీసంగతి చెప్పావుకాదే ?

మ:— నేనెవరితోనూ చెప్పలేదు.

[మహాలక్ష్మమ్మ క్రిందకిదిగి బైటకి నడిచి వెడుతుంది. లావణ్య ఆవిడ్ని అనుసరిస్తుంది.]

జ్యో:—ఈఊళ్లో ప్రజలెలాంటివాళ్లో? వీధుల్లో ఎవరూ కనపడరేం?

శ్రీ:—లేవలేదేమో (తానూ, విశ్వేశ్వరరావూ క్రిందకి దిగుతారు) లేచేక ఆతలుపు తీస్తారేమో ?

వి:—తీస్తే ఊళ్లో కెడదామనా మీ ఉద్దేశం ?

శ్రీ:—వెడదామనే. అక్కడ వ్యాపారస్తుల్ని కలుసుకుంటే ఏదేనా నాకు కలిసిరావచ్చు.

వి:— నేనూవస్తా. మాగిండీ క్లబ్బులాంటి దీ ఊళ్లోనూ ఉండొచ్చు. గుఱ్ఱపుపందాలూ ఉన్నాయేమో...కాస్సేపు నడుద్దాం వస్తారా ?

శ్రీ:—పదండి, (ఇద్దరూ నడుస్తూండగా) మీ జమీందార్లకి డబ్బుని నాలుగు డబ్బులు చేసుకోవడం చేతకాదండీ. మీకు...

[అంటూ ఉభయులు వెళ్ళిపోతారు.]

రా:—(వాళ్లు వెళ్ళిన తర్వాత జ్యోతివేపుచూస్తూ) వాళ్లమాటలు విన్నావా ?

జ్యో:— నేవినలే, నాదృష్టటులేదు.

రా:—మన సంఘానికి నాయకులు వీళ్లు సుమా. గాదికింద పంది కొక్కుల్లాచేరి వీళ్లదీ వాళ్లదీ అన్నమాట లేకుండా - అందరిసొత్తూ హరించడమే వీళ్లుచేసే పని.

జ్యో:—నువ్వు చేసే పనేమిటి ?

రా:— నా మాటేముందిక్కడ ?

జ్యో:—ఇంకెవరిమాట నువు చెప్తూంట ?

రా:—వాడు, వీళ్లిద్దరూ పందికొక్కుల్లా బలిసి...

జ్యో:—(కోపంగా) చాల్లే, నీపందికొక్కులూ నువ్వూను.

రా:—ఏమలా మాట్లాడుతున్నావ్ ?

జ్యో:—ఏమా ? ఎదుటో మహాపట్నముంటే దాన్ని చూడనేనా చూడకుండా "ఏమో ఎలాంటిదో" అన్న వేదాంతం. ఎలాంటి ఊరో తెలుసుకుందామన్న ధ్యాసేమన్నేనా ? ఎవరో వెధవపనులు చేస్తున్నా నుట, వాళ్లని కనిపెడుతూ కూర్చోడమేగా నీపని ?

రా:—ఐతే ?

జ్యో:—నీకంటే ఆ పందికొక్కులేనయం.

రా:—ఆ ?

జ్యో:—(కోపం పట్టలేక) నేనో బుద్ధితక్కువదాన్ని కాకపోతే యింతవరకెందుకు తెచ్చుకోవాలీ ?

రా:—ఒక్కమాట విను.

జ్యో:—ఇంతసేపూ విన్నది చాలదూ ?

[అని రివ్వున వెళ్ళిపోతుంది. రామమోహన్ నిర్ఘాంతపోయి ఆవిడ వెళ్ళిన కేసి చూస్తాడు.]

రా:—(వెంకట్రావుతో) ఎందుకండీ, అలా మండి పడుతుందీ ?

వెం:—నాకేం బోధపడ్డం లేదండీ.

భా:—ఆవిడతో అంతసేపూ ఉండి యీ మాత్రమేనా కని పెట్టలేరూ ?

వెం:—భాగ్యం, నీకోసం వెతుకుతున్నా కాని...

భా:—ఆ మాటిదివరకు చెప్పారుగా ?

వెం:—నిన్ను వెతుకుతూండడమూ తప్పేనా ?

భా:—పాపం నన్ను వెతుకుతూ ఉండే ఆవిడతో సహవాసం చేశారు ! మొగాళ్లని నమ్మడమంత బుద్ధితక్కువింకొకటుందా ?

[అని తటాలున వెళ్ళిపోతుంది. వెంకట్రావు ఆవిడవెంట వెళదామా అని చూసి మళ్ళీ ఆగిపోతాడు.]

వెం:—(సీతారామమ్మ, రామమోహనులతో) ఎప్పుడూ యిలాఉండే మనిషి కాదు సుమండీ. నేనూ వెడుదునా, ఒక్కర్తే వెళ్ళింది.

రా:—ఏం ఫర్వాలేదు లెండి.

సీ:—మీరు వెడితే మళ్ళీ మొదటి కొస్తుందేమో.

రా:—మీ ఆవిడ కోపదారి మనిషి. ఆ జ్యోతీ అలాంటిదే. పిన్నీ నువ్ చెప్పు, మీ ఆడవాళ్ళిలా ఎందుకుంటారు? తేనె లొలుకుతూ కాస్సేపు మాట్టాడి-అంతట్లోనే మళ్ళీ - కొట్ల కుక్కల్లా మీదపడి కరవ పోతారేం ?

సీ:—దేనికి తగ్గ కారణం దానికుంటుంది. దీనికి మొగాళ్ళన్నమా టేమిటి, ఆడాళ్ళన్నమాటేమిటి ?

రా:—మొగాళ్ళని కూడా నువ్వు కలుపుతే నే ఒప్పను పిన్నీ. వెంకట్రావుగారూ! ఆడవాళ్ల కొచ్చినంత చప్పున మనకీ వస్తుందా కోపం ?

వెం:—రాదండీ. ఏ కారణం లేకుండా వస్తుందండీ ఆడవాళ్లకి కోపం.

సీ:—కారణంలేకుండా ఎవ్వరికీ కోపంరాదు. మీ ఆవిడమాటే తీసుకోండి. మీరేమయిపోయారో అని చింకుపడుతూ అవిడిక్కడి కొచ్చింది. అసలావిడ, కాస్తంటే గంపెడు చేసుకునే మనిషి. దానికి తగ్గట్టుగానే, ఆవిడొచ్చేసరికి మీరింకో ఆవిడ్ని వెంటపెట్టుకొచ్చారు. మీ ఉభయుల్నీ చూడ్డంతోటే - మిమ్మల్ని మింగేద్దామా అన్నంత కోప మొచ్చిందావిడకి. మీరేం తప్పపని చేశారని నే అనడంలేదు సుమండీ.

రా:—సరే, పిన్నీ, నీ కందరి మనస్సులూ తెలుసు. ఆజ్యోతికే మొచ్చిందీ చెప్పూ, నామీ దెందుకలా విరుచుకుపడిందీ ?

సీ:—ఆ అమ్మాయిగుట్టు నే ఎందుకు బయట పెట్టాలి ?

రా:—పర్వాలేదు, పిన్నీ ! నువ్ చెప్పావని నే ఎవరితో చెప్పనులే, వెంకట్రావుగారూ చెప్పరు.

వెం:—అబ్బే, నే ఎందుకు చెపుతానూ ?

సీ:—పురుషప్రేమకోరి ఎన్నోసారులు నిరాశ చెందుందా జ్యోతి. నిన్నిక్కడ కలుసుకుని, నీమీద మనసు పెడితే...

వెం:—(గతుక్కుమని) నామీదే ?

సీ:—నీమీద కాదతనిమీద (రామ్ మోహన్‌తో) నువ్వూ అవిడ్ని నిరుత్సాహ పరిచావు. దానితో, నీమీద మనసెందుకు పెట్టానా అని తన్ను తాను తిట్టుకుని, అంతకూ కారణం నువు గనుక నిన్నూ తిట్టి పోయింది.

రా:—అదా కారణం ?

వెం:—(సీతారామమ్మతో) మీరు మనుష్యుల స్వభావాలు బాగా కనిపెడతారే.

సీ:—వాళ్లేమంటున్నారో, ఏం జేస్తున్నారో కనిపెడతూ ఉంటా.

రా:—పిన్నీ, నువ్వు నా ఉత్సాహమంతా పోగొట్టావ్.

సీ:—ఏం ? జ్యోతిని నువు నిరుత్సాహ పరిచావని చెప్పా ?

రా:—నువు చెప్పిన కారణం నాకునచ్చలేదు పిన్నీ, సూటిగా చెప్పేశావు కాని.

సీ:—సూటిగా చేపితే మంచిదేగా ?

రా:—ఏమో, నాకు నచ్చలేదు. ఎందుచేతంటే, నేను లౌక్యైన మనిషిని, అమాయకుడ్నీకాను. వెంకట్రావుగారూ, మీరో ?

వెం:— నే అమాయకుడ్నీకాను, లౌక్యైన మనిషినీకాను. రెండింటికి మధ్యరకం.

రా:—(విచారంగా) నాకు చిక్కల్లా ఎక్కడొస్తుందంటే - సంఘం బాగుపడాలనే కోరికోవేపూ; ఇక్కడ బాగుపడుతుందనే అపనమ్మకమోవేపూ - రెండూ రెండువేపులా నన్ను లాగుతూ ఉంటాయి. ఇటూ వెళ్ళలేక అటూ వెళ్ళలేక మధ్యనుపడి ఊగొట్టుకుంటూ ఉంటా.

వెం:—సంఘం బాగుపడ్డమంటే, మీ ఉద్దేశమేమిటి ?

రా:—ఇప్పటి సంఘ పరిస్థితులన్నీ మారి ఆస్థానే కొత్త పరిస్థితులేర్పడడం. ప్రస్తుత సంఘం - కూలిపోతూన్న యిల్లులా ఉంది. నాలుగు రోజు లోపికపట్టీ సంక్షోభంలో నీస్వతంత్ర భారత బాంకేమవుతుందో నువ్వే చూద్దువుకాని.

వెం:—ఆ బాంకేమైనా నాకువిచారంలేదు. అదో దొంగలముఠా.

రా:—నిజంగా ?

వెం:—(రహస్యంగా) అందరిలో పెద్దదొంగ మా బాంకి డైరెక్టరు సర్ సి. కృష్ణస్వామిమొదలియార్. పొద్దస్తమానం వీడు చేసేపని - యింగ్లీషువాళ్ళ వెనకాల చేతులు నలుపుకుంటూ తిరగడమే.

రా:—నా ఒక్కడితోనూ చెప్పేం ప్రయోజనమయ్యా ? నీకా ధైర్యముంటే అముక్క నలుగురికీ వినపడేలా యీ గోడెక్కి చెప్పు చూద్దాం.

వెం:—(గోడెక్కి నిలబడి గొంతెత్తి) అందరిలోనూ పెద్దదొంగ మా బాంకి డైరెక్టరు సర్ సి. కృష్ణస్వామిమొదలియార్. పొద్దస్తమానం వీడు చేసేపని - యింగ్లీషువాళ్ళ వెనకాల చేతులు నలుపుకుంటూ తిరగడమే.

భా:—(తొందరగా ప్రవేశించి) ఏమండోయి, గోడెక్కలా బొబ్బ లెడుతున్నారు ? మీకు మతిచెడిందేమో అని భయపడి పరుగుపరుగు నొచ్చా.

వెం:—(నవ్వుతూ) అంతపని జరగలేదులే.

రా:—లేదనెందుకనాలి, మతిచెడిందనే చెప్పవయ్యా.

భా:—(వెంకట్రావు చెయ్యి నిమురుతూ) మీరెప్పట్లా ఉన్నట్టేనా ? నే ఎంత గాభరాపడ్డా ననుకున్నారు !

[నవ్వుతూ వెంకట్రావు పెళ్ళాంకేసిచూచి అవిడ్ని దగ్గిరకు తీసుకుంటాడు. దానితో భాగ్యేశ్వరి హృదయ ముప్పొంగుతుంది. ఓ నిముషంపోయాక వెంకట్రావు భార్యని విడుస్తాడు]

వెం:—(రామమోహన్‌తో) పాతసంఘం కూలిపోతూందన్నావే. అస్థానే కొత్తసంఘం లేవడంలేదూ ?

రా:—నలుగురూ నడుంకట్టి పనిచేస్తేనా కొత్తసంఘం లేవడానికి ? ప్రపంచంలో ఏ ఘనకార్యమేనా నిర్వహించిన వాళ్లెవరు ? ఒకళ్ళతో సంబంధం పెట్టుకోకుండా పనిచేసినవాళ్ళు. నలుగురూ తలపెట్టినపని రసాభాసు చెయ్యడం తప్పితే యింకొకటుందా ?

వెం:—రసాభాసెందుకు చేస్తారూ ?

రా:—ఓ ఉదాహరణ చెపుతా విను. ఓ గొప్పభవనాన్ని తీసుకో, లేదా ఓ ఉపయోగమైన యంత్రాన్ని తీసుకో. వీటినిచూస్తే, మానవుడి కింత ప్రజ్ఞుందా అనిపిస్తుంది. వీటిని నిర్మించిన వాళ్లెవరు? ప్రత్యేక వ్యక్తులు. అందుకే యివింత బాగున్నాయి. మనుష్యులు పదిమందీ పూనుకు నిర్వహించిన వాటినిచూడు. ఊళ్ళూ, పట్నాలూ, రాజ్యాలూ, యిలాంటి వేనా ? ఇవెంత అసందర్భంగా ఏడుస్తున్నాయో నేచెప్పలా? నలుగురూ కలుస్తే రసాభాసే అనొప్పుకుంటావా ?

వెం:—ఒప్పుకోవలసిందే.

రా:—ఈ ముక్కే నేనంతే కొందరంగీకరించరు. "మనుష్యుల్నెందు కంటావ్ యిప్పటి సంఘపరిస్థితుల నను. ఈ సంఘం ఏర్పరచిన కట్టు బాట్లనను," అంటారువాళ్ళు. అవునయ్యా ఈ పరిస్థితులు చండాల మైనవే. అక్రమమైనవే యీ కట్టుబాట్లు. నే కాదనడంలేదు. అలా అని ఇవి తిరగతొయ్యడానికి నలుగురూ పూనుకొస్తున్నారా ? ఏమో, చూసి చూసి నాకు మనుష్యులమీద దసహ్యం పుట్టింది.

భా:—గుక్కతిప్పకుండా నువ్వెంతసేపు మాటాడగలవు ?

మె:—(వారిస్తూ) భాగ్యం!

భా:—అతనిష్టం వచ్చినట్టతను మాట్లాడొచ్చుగాని, నే మాట్లాడ కూడదేం ? మతిచెడిందని మిమ్మల్ని చెప్పమనలే ?

రా:—చెప్పమన్నా. మతున్న వెంకట్రావెలాగా నీకు నచ్చలేదు. మతిచెడ్డ వెంకట్రావేనా నచ్చుతాడేమో అనన్నా. పోనీ నీకేం లోటొ చ్చింది ? నువ్వెప్పుడూ అలా బాధపడుతూ ఉంటావేం ?

భా:—నాకో పువ్వులతోట కావాలి, ముగ్గురు పిల్లలు కావాలి. ఇప్పు డదీలే ఇదీలేదు.

రా:—నువ్వు కోరేవి నీ పిల్లలూ, నీ తోటానా ?

భా:—కాకపోతే ? ఊళ్లోవాళ్ల పిల్లల్ని తీసుకొచ్చి పార్కులో నన్నాడించమన్నావా ? (ఎక్కువ కోరిక కనపరుస్తూ) నా పిల్లలూ,

నా తోటా-యివీ నే కోరుతూంట.

[అని సీతారామమ్మ ప్రక్కను వెళ్ళి కూర్చుంటుంది. సీతారామమ్మ అవిడ్ని ఓదారుస్తూ భుజంమీద తడుతూ ఉంటుంది]

రా:—(కాస్సేపాగి వెంకట్రావుతో) చూశావా మనవాళ్ల పాకులాట - ఎంతసేపూ మాకిది కావాలనీ, అది కావాలనీ.

వెం:—అలా కోరడం సహజమే కాదుటోయి ?

రా:—సహజమని ఎవరిబాగు వాళ్లు చూసుకుంటూ కూర్చుంటే సంఘాన్ని బాగుపరిచే వాళ్లెవరు ? నలుగురూ కూడిరానిదే కొత్త సంఘం ఎలా ఏర్పడుతుంది ! కొత్తసంఘ మేర్పడకపోతే మనలాంటి వాళ్ల గతేంకావాలీ ?

వెం:—అవున్లే. యీ విషయాలగురించి నే అట్టే ఆలోచించలే.

రా:—నువ్వ వేటిగురిం చాలోచించావ్ ?

వెం:—బాంకులగురించి, వ్యాపారంగురించి. మిల్లు జయమానులే బాంకులికి డైరక్టర్లా. నువ్వూ నేనూ పదీ పాతికా బాంకిలో దాచుకుంటే, యిదంతా పోగయి డైరక్టర్ల చేతులలోకొస్తుంది. డైరక్టర్లెవరు ? మిల్లు యజమానులు, వ్యాపారస్తులు. వీళ్ళీడబ్బు స్వంత వ్యాపారాలలో పెట్టుకుంటూ ఉంటారు సుమా. ఆ వ్యాపారం దెబ్బతిందంటే బాంకీ దివాలా తీస్తుంది. నే యిది పబ్లిక్‌గా అనడానికి వీల్లేదుకాని...

రా:—మీ డైరక్టరు కృష్ణస్వామి మొదలియార్‌తో చెప్పిచూడలేకపోయావు, వాడేమంటాడో.

వెం:—(నవ్వుతూ) కృష్ణస్వామి మొదలియార్‌తో చెపితే నాపనికే పుద్వాసన చెపుతాడు.

రా:—ఇప్పుడు నీ పనుందన్న మాటేమిటి ? మనంపరం యిక్కడికి ఎందు కొచ్చాం ?

భా:—ఇంతసేపటికి అసలు సుక్కొందుకున్నావ్. ఏవో అక్కరమాలిన గొడవలు పెట్టుకోకపోతే, మళ్ళీ మన ఊరెలా చేరుకోడమో.

రా:—(తత్తరపాటుతో, తలుపుకేసిచూసి) ఆ తలుపునిచూడు.

[తలుపు నెమ్మదిగా, ఒత్తిగిలి చివరికి పూర్తిగా తెరుచుకుంటుంది. సూర్య కిరణాలు గుమ్మంలోంచి పైకిపడుతూ ఉంటాయి. అందరూ అటుకేసిచూస్తూ ఉంటారు.]

సీ:—(నింపాదిగాలేచి) గుమ్మమవతల ఏముందో నే చూసొస్తా.

[అని గుమ్మంలోంచి దిగి వెళ్ళిపోతుంది.]

రా:—జంకూ గొంకూ లేకుండా ఎలా వెళ్ళిపోయిందో! మనందరి కంటే పిన్నవయం. ఏం నిబ్బరమయిన మనస్సు!

భా:—ఆవిడాట్టే మాట్లాడదు. అందుకే నిబ్బరంగా ఉందేమో ఆవిడ మనస్సు.

రా:—అయుండొచ్చు.

[వెంకట్రావు గుమ్మందగ్గరకెళ్ళి చూస్తూ ఉంటాడు.]

భా:—(మొగుడితో) జాగ్రత్తండోయ్. ఏం జేస్తున్నారు?

వెం:—ఇక్కడేముందో చూస్తున్నా. (కిందకి దిగివెళ్ళి మళ్ళీ పైకొస్తాడు) భాగ్యం, యిక్కడ మెట్లూ, మెట్లచివర ఊళ్ళోకి రోడ్డూ ఉన్నాయి.

భా:—అయితే మనం ఊళ్ళోకెళ్ళొచ్చా?

వెం:—ఎందు కెళ్ళకూడదూ? మన్నిరమ్మని తలుపు తీశారుగా? ఊరు చాలా బాగున్నట్టుంది మాడ్దాం రా.

భా:—(కొస్తసందేహించి) నరేపదండి.

[అంటూ ఉభయులూ మెట్లుదిగి వెళ్ళిపోతారు.]

[ఒక నిముషంపోయాక రామమోహన్, "ఎవెక జన్మములోన, ఎవరమో నంటి" అని తనలో పాడుకుంటూ, వాళ్ళవెనకాల మెట్లుదిగి వెడతాడు. కాస్సేపుండి మళ్ళీ బయటకొచ్చి పచారీచేస్తూ ఉంటాడు. ఇంతలో లావణ్య, మహాలక్ష్మమ్మ మాట్లాడుకుంటూ వస్తారు.]

లా:—ఎంతో మంచివాళ్ళలా కనపడుతున్నారమ్మా ఆ ఊళ్ళోవాళ్ళు.

మ:—ఏమో? అల్లరి చిల్లరి మూకేమో!

లా:—అలాంటివాళ్ళు కారమ్మా. (తలుపుకేసిచూసి ఎన్నాళ్ళకో తలుపు తెరుచుకునుంది - చూశావా?

రా:—అవును, బార్లా తెరచుకునుంది. తలుపవతల మెట్లు, మెట్ల చివర రోడ్డూ ఉన్నాయి. అప్పుడే సీతారామమ్మగారూ, వెంకట్రావూ, భాగ్యేశ్వరీ ఊళ్లో కెళ్ళారు.

లా:—మనమూ వెడదాం రా, అమ్మా.

మ:—కాస్సేపాగు. రాజాబహద్దుర్, శ్రీకాంతయ్యగార్లుకూడా రానీ.

లా:—నువ్వాగితే ఆగు, నే వెడుతున్నా.

మ:—(కూతురు భుజంమీద చెయ్యివేసి) లావణ్యా, నువ్వు పెద్ద దానివవుతున్నావు కాని...

లా:—అది, నువు గ్రహించావు, సంతోషమే.

మ:—(నెమ్మదిగా) పెద్దదాని వవుతూన్నందుకు నన్ను గడ్డిపరకలా తీసెయడమా నువ్వు చెయ్యాలసినపని? ఒకప్పుడు కాకపోతే ఒకప్పు డయినా, అమ్మేం నొచ్చుకుంటుందో అన్నమాట...

లా:—(సగం చిరాకు సగం అనుతాపం కనపరుస్తూ) నాకుందమ్మా, ఆమాట.

మ:—(అధికారం కనపరుస్తూ) అయితే పద. (రామమోహన్‌తో) రాజాబహద్దుర్, శ్రీకాంతయ్యగార్లొస్తే మేం ఊళ్లోకి వెళ్లేమని చెప్పేం.

రా:—అలాగే.

లా:—(రామమోహన్‌తో) మా అందరికంటే ముందు వెళ్లవలసిన వాడివి, నువురావూ?

రా:—ఏమో వస్తేవస్తా, లేకపోతే లేదు.

[తల్లీకూతురూ వెళ్ళిపోతారు. రామమోహన్ కూర్చుని ఉంటాడు. కాసేపు పోయాక విశ్వేశ్వరరావు, శ్రీకాంతయ్య మాట్లాడుకుంటూ వస్తారు]

శ్రీ:—ఆ రామప్పంతులుగాడు మా ఆఫీసుకొచ్చి "శ్రీకాంతయ్య గారూ, మీ మిల్లు నే కొనేశా. యిప్పుడే లక్షరూపాయిలు బజానా యిచ్చేస్తున్నా," అన్నాడు. "మంచిమాటే కాని రామప్పంతులూ యీ షరతు మాటేంచెప్పా" వన్నా నాదగ్గరున్న దస్తావేజుతీసి చూపించి.

వి:—ఏమిటా షరతు ?

శ్రీ:—నా అనుమతిలేనిదే యీ మిల్లెవరికీ అమ్మకూడదని.

వి:—మరీ షరతు వాడు చూసుకోలేదూ ?

శ్రీ:—వాడికిచ్చిన దస్తావేజులో యీ షరతులేకుండా చేశాం నేనూ, మా వకీలు రాఘవాచారీ కలిసి. బుఱ్ఱంటే రాఘవాచారిదే బుఱ్ఱండీ. రామప్పంతులుగాడి లక్షరూపాయిలూ నాకో యాభైవేలూ వాడికో యాభైవేలూ.

వి:—వెఱ్ఱివెధవకి మాబాగా టోపీవేశారు లెండి. (రామమోహన్‌తో) ఏం నువ్వొక్కడవే ఉన్నావేమయ్యా ? మిగతా వాళ్లందరూ ఏమయ్యారు ?

రా:—ఇప్పుడే యీ దారిని ఊళ్ళో కెళ్ళారు. మహాలక్ష్మమ్మా కూతురూ వెడుతూ మీ ఉభయులూ వస్తే చెప్పమని, నాతో చెప్పారు.

వి:—(తలుపు కేసి చూసి) ఓహో, తలుపుతీసుందా? మనమూ వెడదా మొస్తారా శ్రీకాంతయ్యగారూ ?

శ్రీ:—అలాగే పదండి. (వాళ్లు వెడుతూ ఉండగా) రాజాబహద్దుర్, మీకీ ఎస్టేటెలా వచ్చిందండీ.

వి:—విక్టోరియారాణీ మా తాతగారికిచ్చిందిట. ఏడాదికో పదిహేను లక్షలొస్తూన్నా, యీ ఎస్టేటుతో మా బాదరబందీ ఉందండీ. ఎస్టేట్లన్నీ గవర్నమెంటువారు పుచ్చుకొని ఏటేటా మా డబ్బు మాకిచ్చేస్తూ ఉంటా రుట కాదూ ?

[అంటూ యిద్దరూ గుమ్మంలోంచి వెళ్ళిపోతారు. రామమోహన్ ఖిన్నుడై కూర్చుంటాడు. జ్యోతిర్మయి చిన్నబోయిన మొహంతో ప్రవేశిస్తుంది]

జ్యో:—ఏం, రాం యిక్కడ కూర్చున్నావ్ ?

రా:—ఏమీలేదు జ్యోతీ.

జ్యో:—(సందేహిస్తూ) నీ మీద చిరాకుపడి వెళ్ళిపోయా. ఏమీ అనుకోకేం ?

రా:—నే ఏదో అసందర్భంగా మాట్లాడుంటా.

జ్యో:—కాదు, నాకే ఒళ్లు తెలియని కోపమొచ్చింది. నాకంత కోప మొచ్చేదికాదు, నువ్వు నన్నాకర్షించుండక పోతే.

రా:—పిన్నన్నమాటా అదే.

జ్యో:—పిన్నెవరు, సీతారామమ్మగారా? ఏమిటీ? నేవెళ్లేక నన్ను గురించి మీరు మాటాడుకుంటూ కూర్చున్నారా?

రా:—లేదు. ఏదో మాటసందర్భాన్నందామెక్క. నీ ఉత్సాహాన్ని నే భంగపరిచానంది కూడా.

జ్యో:—నిజమే రాం, నా ఉత్సాహం నువ్వు భంగపరిచావు.

రా:—(జ్యోతిర్మయి మొహంకేసి చూస్తూ) నే ఏమంత కోరదగ్గ మనిషిని చెప్పా?

జ్యో:—నే మాత్రమో?

రా:—(ఇంకా జ్యోతి మొహంకేసి చూస్తూ) ఆమెక్క నువ్వంటే నే ఒప్పుకోను. నీమొహం చూసే చూడ్డంతోటే నే అనుకున్నా, "రాం యీవేళం చిక్కింది నీకంటపడింపోయి." అని.

జ్యో:—(మనస్సులో సంతోషించి పైకా సంతోషం కనపర్చక) నన్ను పొగడా లనంటున్నావా?

రా:—నిజం జ్యోతీ. ఒక్కసారా? మళ్ళీ మళ్ళీ ఆమాటనుకున్నా. (తలుపుకేసి చూపించి) తలుపు తీసుంది చూశావా?

జ్యో:—(సంతోషంతో) తలుపు తీసుందా? ఊళ్ళో కందరూ వెళ్ళారా?

రా:—అవును, జ్యోతీ.

జ్యో:—నే వచ్చేదాకా నున్నావా?

రా:—నువు మళ్ళీ వస్తావనుకున్నా.

జ్యో:—వచ్చాగా పద, మనమూ వెడదాం.

రా:—నే చెప్పతే, చాలాఊళ్లు చూశాననీ?

జ్యో:—చూస్తే!

రా:—సముద్ర ప్రయాణంచే సో ఊరు చేరుకోపోయే ముందు...

జ్యో:—దూరాన్నుంచెంతో అందమైన ఊరులా కనపడ్డం ఊళ్ళో. అడుగెట్టా కెప్పుడొదిలి పోతామా అనిపించడం. ఎక్కడికెళ్ళినా చింపిరి తలలవాళ్ళూ చింకిగుడ్డలవాళ్ళూ నీకెదురవడం - యివన్నీ చెప్పావుగా ?

రా:—అయితే యింకేముంది చెప్పడానికి ?

జ్యో:—ఈ ఊరలాంటిది కాదు, రాం.

రా:—నువ్వెలా చెప్పగలవు జ్యోతీ ?

జ్యో:—నామనసు చెప్తూంది, నమ్ము ఇదో చిత్రమైన ఊరని. నే యిందాకటినుంచీ దీనికేసి చూస్తున్నాగా ? ఇదెక్కడా మనంచూసిన ఊళ్ళలా లేదు. సందేహిస్తా వెందుకు చప్పున లే (ఆతుర్దాగా) ఏం, రాం.

రా:—వద్దు జ్యోతీ. ఎన్నోసార్లు నేనూ 'ఆశాభంగం చెందున్నా - మనిద్దరం యీవిషయంలో ఓ లాంటివాళ్ళమే, మళ్ళీ నన్నెందుకు చెయి జాచ మంటావ్ ?

జ్యో:—ఈసారలా జరగదులే, లే, లే.

[అని రెక్కపట్టుకు లేవతీస్తుంది. రామమోహన్ లేచి ఆవిడ్ని కౌగలించుకో పోతాడు. జ్యోతిర్మయి నేర్పుగా తప్పించుకుంటుంది]

జ్యో:—ఆగాగు.

రా:—ఏం ?

జ్యో:—ఇదా సమయం ?

రా:—అంతేనా ? ఆ సమయ మెప్పుడో అందాకా ఆగుతాలే.

జ్యో:—నువ్వాగీ ఉపయోగంలేదు-బలాత్కారం చెయ్యాలనిచూస్తే, అసలుకే మోసమొస్తుంది సుమా.

రా:—(ఆవిడ మొహం కేసి చూస్తూ నెమ్మదిగా ) సరే అలాగా ? ఆ మాటా జ్ఞాపకముంచుకుంటా.

జ్యో:—మరి నువ్వు ఊళ్ళోకొస్తావా ?

రా:—వస్తా పద.

జ్యో:—(సంతోషంతో) రాం!

[అనో కటాక్షవీక్షణం మతని ప్రసాదించి ఉభయులూ కలిసి గుమ్మంలోంచి వెడుతూండగా దూరాన్నుంచి భేరీమోత వినపడుతుంది]

( తెర )

## ద్వితీయాంకము

[ప్రథమాంకంలో ఉన్నట్టే గోపురం, తలుపు, గోడ, రాతిదిమ్మలూ ఉంటాయి. వెలుతుర్నిబట్టి సాయంత్ర మైదుగంటలయిందనుకోవచ్చు. తలుపు బార్లా తెరుచుకుంటుంది. విశ్వేశ్వరరావు గుమ్మంలోంచి ప్రవేసించి నెమ్మదిగానడిచి వెళ్ళి రాతిదిమ్మమీద కూర్చుంటాడు. ఇంగ్లీషువాళ్ల కాల్చే లావుపాటి చుట్టవెలిగించి కాలుస్తూ ఉంటాడు. కాస్సేపుపోయాక గుమ్మంలోంచి భాగ్యేశ్వరొస్తుంది]

భా:—ఏమండీ, రాజాబహద్దుర్, మా ఆయన మీకు కనిపించారా ?

వి:—నాకు కనపడలేదే. ఈ చుట్టుపక్కలున్నారేమో. నే బైట కొచ్చిందీ యిప్పుడే.

భా:—ఆయనన్నారు; "భాగ్యం, మనమోవేళ విడిపోతే మళ్ళీ ఆ గోపురందగ్గర కలుసుకుందాం" ఇంత సేపెక్కడుండీపోయారో.

వి:—ఈపాటికొస్తూ ఉంటారు లెండి - యింకా బోలెడు పొద్దుందిగా ? కూర్చోండి కాస్సేపు (భాగ్యేశ్వరి యింకో రాతిదిమ్మమీద కూర్చుంటుంది) ఎం తలిసిపోయా మీవేళ !

భా:—నన్నూ మా ఆయన తిప్పిచంపారు...రాజాబహద్దుర్, మీకీ ఊరు నచ్చిందండీ ?

వి:—ఏముం దీ పాడుఊళ్ళో !

భా:—నాకూ నచ్చలేదు, ఎంచేతో మా ఆయనకి నచ్చిందండీ.

వి:—ఏమిటీ, వెంకట్రావుగారికీ ఊరు నచ్చిందా ? ఆయ నలాంటివాడనుకోలేదే.

భా:—(గతుక్కుమని) ఎలాంటి వాడనుకోలేదు ?

వి:—దీన్నిచూసి తబ్బిబ్బు లౌతాడనుకోలేదు. ఎక్కడో బాంకిలో కాదాయనకి పని ?

భా:—అవు నాయన స్వతంత్రభారత బాంకి మేనేజరు.

వి:—రెండో ప్రపంచం తనకక్కర లేకుండా- తనపని చేసుకుంటూ- పైవాళ్లదయ సంపాదించుకు బతికే మనిషనుకున్నాను.

భా:—(ఉత్సాహంతో) అవునండీ, అలాంటివారే.

వి:—ఆ రెండో వాడున్నాడే - ఎప్పుడూ ఏదో వాగుతుంటాడు, వాడి కీర్తూరు నచ్చిందంటే నే ఆశ్చర్యపడను. వాడి కీఊరే కానింకొకటి నచ్చుదేమో. ఇందాకా రోడ్డుమీద - తనలో తనేదో పాడుకుంటూ పోతున్నాడు - సంతోషం పట్టలేక కాబోలు - వెర్రిముండా కొడుకు !

భా:—ఆ సినిమానటితో - జటపటాలేసుకు వాడు తిరగడం మీరు చూశారా ? పువ్వులతోటలలో వీళ్లుయ్యాల లూగుతున్నారండీ!

వి:—పువ్వులతోట లెక్కడున్నాయి ?

భా:—మనం భోంచేశామే ఆ మేడవెనకాలే పువ్వులతోటలున్నాయి, మీరు చూడలేదూ ?

వి:—భోంచేశాక నే నిద్రపోయా. అయినా తోటలలో చూడ్డాని కేముంటుంది ? వెంకట్రావు గారక్కడుయ్యా లూగుతున్నారా ?

భా:—ఆయన కాదండీ, ఉయ్యాలూగుతున్నదా రామమోహన్ జ్యోతీనీ......మా ఆయన ఇది చూద్దామది చూద్దామని నన్ను వెంటీడ్చుకు పోయారండీ.

వి:—ఆ ఊర్లో చూడవలసిన చిత్రాలు నాకేం కనపడలేదు - అందమైన ఆడవాళ్ళు మినహా.

భా:—ఏ మందమైనవాళ్లులెండి.

వి:—వాళ్ళ చక్కదనం మీకంటి కానకపోయుండొచ్చు. ఇది తప్ప విడుస్తే ఏముందా ఊళ్లో ? ఎక్కడచూసినా గుంపులు గుంపులు జనం. నాకసలు జనాన్ని చూస్తే రోత. నిర్జనప్రదేశాలంటే యిష్టం. మన తాహతుకి తగ్గవాళ్లు కొద్దిమంది - ఒకళ్లో యిద్దరో నాకర్లూ - వీళ్లుంటే, మిగతా ప్రపంచ మెలాపోయినా నాకు విచారంలేదండీ......ఏమండీ, మీరు మాక్లబ్బు కెప్పుడైనా వచ్చారూ ?

భా:—లేదండీ.

వి:—మతిమాలిన ప్రశ్న - మీరు మాక్లబ్బు కెందుకొస్తారూ ? మాక్లబ్బులోవాళ్లం ఎప్పుడో కాని ఒకళ్లతో ఒకళ్లం మాట్లాడుకోం.

ఎవరిగదుల్లోవాళ్లు కూర్చుని, అక్కడికే కావలసినవి తెప్పించుకుంటూ, ఒకళ్లగొడవ వింకొకళ్లకి లేకుండా బతుకుతాం. ఈ ఊళ్లోవాళ్లేమిటండీ - ఒకళ్లభుజాన్నొకళ్లు రాసుకుంటూ - అందరూకలిసి మెలిసి - అనాగరకుల్లా బతుకుతున్నారు! అందులో ఏదో ఘనతున్నట్టు నవ్వుమొహం లేసుకు తిరుగుతున్నారు! వాళ్ల మొహాలు చూస్తూంటే నా కరికాలిమంట నెత్తికొచ్చింది. అదుగో, శ్రీకాంతయ్యగారొస్తున్నారు. (శ్రీకాంతయ్య గుమ్మంలోంచి ప్రవేశిస్తాడు) ఏం, శ్రీకాంతయ్యగారూ, యీ ఊరు మీకూ మొహం మొత్తినట్టుందే ?

శ్రీ:—అవునండీ, యీఊళ్లో ఎందుకడుగెట్టానా అని విచారిస్తున్నా.

భా:—నాకూ నచ్చలేదండీ, యీ ఊరు.

శ్రీ:—రాజాబహద్దుర్, మీకో. ?

వి:—నిలువెత్తు ధనమిస్తాం మా ఊళ్లోవచ్చి ఉండండన్నా, నే యిక్కడుండను. అలా మన్నెవరూ కోరలేదనుకోండి. పైపెచ్చు నా మొహంమీదే నవ్వడం మొదలెట్టారు. "మీరేంపని చేస్తూంటా"రని వాళ్లడిగితే "తరుచూ గుఱ్ఱపుపందాల కెడుతూ ఉంటాం. అప్పుడప్పుడు పిట్టల్ని వేటాడుతూంటాం. నే వయస్సులో ఉన్నప్పుడు అడవి జంతువుల్నికూడా కొట్టితెచ్చేవాడిని" అన్నా. "అయితే, మీరు కొండవాళ్లుటండీ ?" అనడిగారు నన్ను - మీరు నమ్ముతారో నమ్మరో!

భా:—ఉత్త మోటు మనుష్యులండీ, వాళ్లకి నాజూకంటే ఏమిటో తెలుస్తేగా ? మీ ఉద్దేశమేమిటి శ్రీకాంతయ్యగారూ ?

శ్రీ:—ఏమో, నాజూకంటే ఏమిటో నాకూ తెలియదు. నాకంటికీఊళ్లో వాళ్లందరూ పిచ్చివెధవలలా కనిపించారు.

వి:—ఏమలా అన్నారు ?

శ్రీ:—నే చెప్పింది విన్నాక మీరూ అముక్కే అంటారు. ఈ వేళ పొద్దున్న నే ఒకడ్ని కలుసుకుని, "ఏమయ్యా, మీఊళ్లో వ్యాపార మెలా సాగుతూం" దనడిగా. "ఏంవ్యాపార" మన్నాడు వాడు. "ఏం వ్యాపారమేమిటయ్యా, అమ్మడం, కొనడం, సరుకు నిలవేసి ధరపెంచడం - యివి మీ ఊళ్లోవాళ్లకి చేతకావూ ?" అన్నా నేను.

వి:—అంటే వాడేమన్నాడు ?

శ్రీ:—వాళ్ల ఊళ్లో యిలాంటివి చెయ్యనివ్వరుట! నే చెయ్యాలని చూస్తే నాకు శిక్ష వేస్తారుట! ఓ ఏడాదిపాటు నాచేత రాళ్లుమోయిస్తారుట!

భా:—పశుప్రాయులు!

శ్రీ:—పోనీ, వీడికి మతిచెడుందేమో యింకొకడ్నడుగుదాం, అనో ముసలాయనదగ్గరకెళ్ళా. ఈయనతో, "ఏమండీ, మీ ఊళ్లో వ్యాపారస్తుల్ని నాకు కలుసుకోవాలనుంది. వాళ్లెక్కడుంటారో చెప్పం" డన్నా. "ఏలాంటి వ్యాపారస్తు" లనడిగాడాయన. ఈయనకీ తెలియదేమో అని మన ఊళ్ళో వ్యాపారాల సంగతి చెప్పా. దానిమీదాయనేం చేశాడనుకున్నారు ?

వి:—ఏం చేశాడు ?

శ్రీ:నన్నో పోలీసు కప్పచెప్పాడండీ!

భా:—ఆ ఊళ్లో పోలీసులులేరే.

శ్రీ:—పోలీసంటే అదో చిత్రమైన పోలీసు. ఈ పోలీసుగాడు నన్నాసుపత్రికి రమ్మన్నాడండీ! నాబుఱ్ఱలో ఏదో జబ్బుందిట! నన్ను డాక్టరుచేత పరీక్షచేయిస్తాడట! నేవాడితో అన్నా! "అబ్బాయీ, నే పొరుగూరివాడిని. మీతో నాకేం సంబంధంలేదు. నువ్వు నాజోలికి రాకు." అంటే వాడు వెళ్ళిపోయాడు.

వి:—పోనీలెండి, వాళ్ల చేతులలో చిక్కుపడకుండా బైటికొచ్చేశారు.

శ్రీ:—(కోపంగా) నే చెప్పేది పూర్తిగా వినండయ్యా. అంత చప్పున నన్నొదిలిపెట్టారా ఆ దౌర్భాగ్యులు? ఇందాకటివాళ్లని తప్పించుకుని పార్కుకేసివెళ్ళా. ఆ పార్కులోవేపు కొత్తగా షాపులుకట్టారు. రెండోవేపు ఖాళీజాగా ఉంది. అక్కడొకడు నిలబడి నోటుబుక్కులో ఏదో వ్రాసుకుంటున్నాడు. నేవాడినడిగా: "ఏమయ్యా, యీవేపు షాపులు కట్టారు కారేం?" "కడదామనుకుంటున్నాం, కొద్దిరోజులలో ప్రారంభిస్తాం" అన్నాడు వాడు. "ఈ సంగతి నలుగురికీ తెలుసా ?"

అని నే అడిగా. "తెలియదు, రహస్యంగా అట్టే పెట్టా" మన్నాడు వాడు. దానిమీద నే అన్నా; "మనిద్దరం వెంటనే యీ జాగాకొనేద్దాం. డబ్బెక్కడో నేతీసుకొస్తా, నీకా జంగొద్దు. జాగా మనపేర వ్రాయించుకున్నాక మనం పెట్టినదానికి పదిరెట్లు లాగొచ్చు. మనం జాగా యివ్వనిదే నీళ్ళు పాపు లెలాకడతారు?" అని. నే అన్న దాంట్లో తప్పేముంది చెప్పండీ. నే యిలా అంటే ఆ తిక్క వెధవేం చేశాడనుకున్నారు?

వి:—ఇంకో పోలీసు కప్పచెప్పాడా?

శ్రీ:—పోలీసయితే బాగానే ఉండును. అపక్కనుంచో స్కూలు మాస్టరు పిల్లల్ని వెంటపెట్టుకొడుతూ ఉంటే వాడికి నన్నప్పచెప్పాడు. గుంపులు గుంపులుగా కుర్రవెధవలు మూచుట్టూ మూగారు. నేమధ్యని చిక్కుపడ్డా. నన్నక్కడ నిల్చోపెట్టి మొదటివాడీ స్కూలుమాస్టరుగాడితో నే అన్నముక్కలన్నీ యాకరవుపెట్టాడు. అప్పుడేం జరిగిందనుకున్నారు?

వి:—నే చెప్పలేను బాబూ, ఏమేనా జరిగుండొచ్చు.

శ్రీ:—ఆ స్కూలుమాస్టరుగాడు నన్ను గురించి లెక్చరివ్వడం మొదలెట్టాడండీ!

వి:—మిమ్మల్ని గురించి లెక్చరా? మిమ్మల్నో వింతమనిషిలా నిల్చోపెట్టి...

శ్రీ:—వాడన్న ముక్కా అదే—నేనో వింతమనిషినట! వాడన్న ముక్కలు జ్ఞాపకం తెచ్చుకోనివ్వండి...పరధనాపహరణం నా నిత్య కృత్యమట!...ఇంకా ఏమిటీ?...ఆ, నా ఆత్మశ్రేయోభిలాష సంఘాపర్ధక హేతువట!

భా:—ఇలా వాళ్ళంటూంటే మీ రూరుకున్నారా? వెధవల్లారా, మీకు మతులు పోయాయా, అనడగలే?

శ్రీ:—అడక్కుండా ఒదిలిపెట్టేనా? వాళ్ళ మొహాలు మాడేలా, 'నే పుట్టుకతోటే భాగ్యవంతుడి ననుకున్నారా. పదిహేనురూపాయిలు గుమాస్తాగా ప్రవేశించి, నా తెలివితేటలూ నా ప్రజ్ఞావిశేషం ఉప

యోగపరచి—ఆనాటికీ ఆనాటికీ గొప్పవాడనయి—చివరకి తాతాబిర్లాలతో సమానుడనయ్యా. శ్రీకాంతయ్యంటే ఏమనుకున్నారేం?' అన్నా.

భా:—దాంతో వాళ్ళనోళ్ళు కట్టడ్డాయా?

శ్రీ:—'ఈ ముక్కలే మళ్ళీ అనం'డని ఓపిగ్గా యివన్నీ ఓ నోటుబుక్కులో వ్రాసుకున్నాడండీ ఆ స్కూలుమాస్టరుగాడు! ఎందుకో వెఱ్ఱివెధవ! నే చెప్పలే వాళ్ళకి మతులుపో యేడుస్తున్నారనీ? కాకపోతే...

[జ్యోతి తొందరగా గుమ్మంలోంచి ప్రవేశించి శ్రీ కాంతయ్యమాట పూర్తి చెయ్యనివ్వకుండా తానుమాట్లాడుతుంది.]

జ్యో:—(ఒగుర్చుకుంటూ) రాం యిక్కడికి కొచ్చాడా?

భా:—లేదే, మీరిద్దరూ ఉయ్యాల లూగుతూన్నప్పుడే నే అతన్ని చూస్తి.

జ్యో:—సరే (అని కూర్చుంటుంది) కాస్సే పలసటతీర్చుకు వెడతా. ఆహా! ఏలాంటి రోజీరోజు.

శ్రీ:—(కోపంగా) మా మంచిరోజే.

భా:—(జ్యోతితో) మా ఆయన నీ కక్కనిపించారా?

జ్యో:—కనిపించారు. నే రోడ్డుమీగాం చొస్తూంటే ఆ పక్క నెవరితోనో మాట్లాడుతున్నారు. "భాగ్యం మీ కక్కనపడిందండీ?" అని నన్నడిగారు.

భా:—సరే...అయితే...యీపాటి కొస్తూంటారు.

జ్యో:—ఆవిడ పేరేమిటి?...ఆ...మహాలక్ష్మమ్మ ... ఆవిడా కనపడింది నాకా ఊళ్ళో. కొండమీదికి రోడ్డుందే ఆ రోడ్డుని నింపాదిగా నడిచి వెడుతూంది. 'ఏమమ్మా, యీ ఊరెలా ఉం'దని నే ఆవిడ్నడిగా. 'ఛీ, పాడు ఊరు, నాకేం నచ్చలే'దం దావిడ.

శ్రీ:—నాకూ నచ్చలే దీ ఊరు.

జ్యో:—నీకు నచ్చకపోడం సహజమే. ఆవిడ కెందుకు నచ్చలేదో? ఆడదీ...

భా:—(ఝుంకారంగా) ఈ పాడుఊరు నాకూ నచ్చలేదు.

జ్యో:—(ఆశ్చర్యపడి) ఊరికే అంటున్నావా నిజంగా అంటున్నావా?

భా:—(కోపం పట్టలేకలేచి) ఈ ఊరంటే నాకసహ్యం, రోత, ఘంట. దీన్ని కాల్చి బుగ్గిచేసేద్దామా అనుంది నాకు.

జ్యో:—(అణచి పెట్టుకున్న కోపంతో భాగ్యేశ్వరిని సమీపించి) ఇలా అన్నందుకు నీ పీక పిసికేసినా పాపంలేదు.

భా:—నువ్వంటేనూ నా కసహ్యమే. ఆ రాంతో జటపటాలేసుకు ఊరంతా తిరుగుతూ - ఉయ్యాలలూగుతూ - సిగ్గూఓడియం విడిచిపెట్టేసి-ఎవరేమనుకుంటారో అన్నమాటేనా లేకుండా...

జ్యో:—నీలాంటి వాళ్ళేమనుకుంటే నాకేం? (నెమ్మదిగా) నాజన్మ సార్థకమయ్యేలా యీనాటికీ ఊరు చూడగలిగా. నిత్యం సంతోషంగా బతుకుతూన్న యీ ఊళ్ళోవాళ్ళని చూస్తూంటే - నా పోయిన ప్రాణం లేచివచ్చినట్టయింది. (భాగ్యేశ్వరితో) నీకు చేతైనది దీనిమీద కాండ్రించి ఉమ్మెయడమా ?

వి:—ఏమిటసభ్యంగా మాట్లాడుతున్నావ్ ?

జ్యో:—(గిఱ్ఱున అతని వేపుతిరిగి) నీతో ఎవరయ్యా మాట్లాడారు? నువుచెప్పేది నాకు తెలియాలా నేచెప్పేది నీకు తెలియాలా ?

వి:—ఏం? నేచెప్పేది నీకెందుకు తెలియదూ? నే తెలుగులో మాట్లాడుతూంటే...

జ్యో:—(అతనిమాట కడ్డొచ్చి) నువ్ తెలుగులో మాట్లాడుతూన్నా నీ ప్రపంచం, నీధోరణీ, నీకే అర్థంకావాలి - తక్కినవాళ్ళ కర్థంకావు. నువ్వూ ఆ మహాలక్ష్మమ్మా - ఉత్సవాలలో ఊరేగించే బొమ్మలలాంటి వాళ్లు. ఆ బొమ్మలతో మాట్టా డెంతుపయోగమో మీతో మాట్టాడీ అంతే. నే మాట్లాడుతూన్న దీవిడతో (అని గిఱ్ఱున భాగ్యేశ్వరికేసి తిరిగి) నీకొచ్చిన రోగమేమిటంటే, ఎవరు సుఖపడుతూన్నా నువు చూ సోర్వలేవు. ఈ అసహనం ఆ పాదమస్తకం నిన్ను దహించేస్తూంది. ఎప్పుడూ నీఏడుపు, నీకు లేదనికాదు, ఒకళ్లకుందనే. వాళ్లకి లేకుండా

చేసి నువు లాక్కున్నప్పుడే నీకు సంతుష్టి. ఆ ఊళ్ళోవాళ్లు సుఖంగా బతుకుతూంటే - వాళ్లని చూస్తూన్నంతసేపూ నీ ఒంటిమీద తేళ్లూ జెఱ్ఱులూ పాకినట్టు బాధపడ్డావు. నీ...

భా:—(ఆగ్రహంతో) నోరుముయ్. ఇంక చాలు. నీ వెధవవాగుడూ నువ్వూను.

[అనేదుస్తూ కింద చతికిలపడుతుంది]

శ్రీ:—(మండిపడుతూ) నువ్ నన్నే యిలా అనుంటే నీ దవడ వాయగొట్టే వాడిని.

జ్యో:—(శ్రీకాంతయ్య మీదకి వెళ్ళి) కొట్టు చూద్దాం. (సాగా వెక్కిరిస్తూ) నీ పోస్టాఫీసు కనపడిందా? నీ ధనాకర్ష ణెంతమట్టు కొచ్చింది? అక్కడ స్కూలు పిల్లలకి లెక్చరిస్తున్నావేమిటీ? (అ నతని మొహంమీదే నవ్వి, తలుపు దగ్గరకు వెడుతూ నెమ్మదిగా తనలో) చిన్నప్పటినుంచీ యిలాంటి ఊరు చూడాలని కోరుతూ వచ్చా కాని నా కోరిక నెరవేరుతుందనుకోలే. నా కళ్ళ ఎదుటే యీ ఊరు ప్రత్యక్ష మవుతుం దనుకోలే. మనుష్యులలో యిలాంటి ఊరు కట్టే శక్తుం దనుకోలే, వీళ్ళలా, సంతోషంగా పనిచేసుకుంటూ ఆడుకుంటూ బతికే వాళ్ళుంటారని నే నమ్మలే. వీళ్ళ శ్రేయస్సు కోరి, నన్నేంచెయమన్నా చేస్తా, నా ప్రాణమివ్వమన్నా యిస్తా.

[అని గుమ్మంలోంచి వెళ్లిపోతుంది]

వి:—(కొన్సేపు పోయాక) అడ్డమైన కూతలూ కూసిపోయింది.

శ్రీ:—ఇదే నా చేతి కిందుంటేనా - మూడురోజులలో దీనిపొగ రణి చెయనూ?

వి:—అణిచేవాడవే కాని నిన్నేమందయ్యా? ఊరేగింపు బొమ్మని నన్నందికాని నిన్ననలేదే......అంటే అందికాని నాకిలాంటి, ఇంకి పిల్లల్ని చూస్తే సరదా......పోనీ కాని, నువ్వు రాజా రఘుపతిరావు నెరుగుదువా?

శ్రీ:—(చిరాకుగా) రఘుపతిరా వెవరో నా కేం తెలుసునయ్యా.

వి:—ఇత నూరూ వాడా అప్పులు చేశాడులే. నువుకూడా అప్పిచ్చావేమో అనడిగా.

శ్రీ:—(కోపంగా) నేవడ్డీ వ్యాపారస్తుడి ననుకున్నావా ?

వి:—పోనీవయ్యా కాపోతే......ఎవరావస్తూన్నది ?

[ఆయాసపడుతూ నెమ్మదిగా గుమ్మంలోంచి మహలక్ష్మి వొస్తుంది. భాగ్యేశ్వరి ఆవిడ వేపొకసారి చూసి మళ్ళీ పెదమొహం పెడుతుంది]

వి:—ఏం మహలక్ష్మమ్మగారూ, చాలా అలిసిపోయినట్టున్నారే ?

మ:—అవునండీ, లావణ్య నన్నూరికే తిప్పిచంపింది. మధ్యాహ్నంనే వెళిపోదాంరావే అంటే వచ్చింది కాదు. చివరకీ నాతో వచ్చింది కాదు. ఏదో చూస్తూ నిలబడిపోయింది.

వి:—మీకీ ఊరు నచ్చిందా ?

మ:—ఏం ఊరండీ ఊరు ? ఈ వూళ్ళోవాళ్ళకి మన్ని చూస్తే గౌరవం లేదండీ. పెద్దింటివాళ్లూ, పెద్దబతుకు బతికినవాళ్లూ అన్నమాటుండాలా? అదేంలేదు—అందర్నీ చూసినట్టే మన్నీ చూస్తారు !

వి:—పశుప్రాయులు !

మ:—నేనాస్కూల్లో ఆవిడనడిగా ! "వీఊళ్లో దానం ధర్మం ఎవరేనా చేస్తూఉంటారా ?" అని నే అడిగిందాన్లో తప్పేముంది చెప్పండీ ? ఇం కావిడ నన్నుచూసి నవ్వడం మొదలెట్టింది. పైపెచ్చు ఆవి డన్న దేమిటో విన్నారా ? మనసంఘంలో కుళ్లు కప్పుకోడానికి దానధర్మాలు చేస్తూంటామట !

శ్రీ:—(పళ్లుబిగించి) మిమ్మల్ని గురించి లెక్చరేమేనా యిచ్చిందా ?

మ:—నన్నుగురించి లెక్చరేమిటి ?

శ్రీ:—అయితే మీకు వాళ్ళసంగతి తెలియదు. నే చెపుతా వినండి. ఆపార్కు పక్కని పాఫులున్నాయి చూశారా?

వి:—(శ్రీకాంతయ్య గొడవ చెప్పనివ్వకుండా అడ్డొచ్చి) మహలక్ష్మమ్మగారూ, మీరు రాజారఘుపతిరావు నెరుగుదురండీ ?

మ:—ఏ రఘుపతిరావు ? చిట్టివలసవా రల్లుడేనా ?

శ్రీ:—చిట్టివలసవారల్లుడనీ పొట్టివలసవారల్లుడనీ, ఏమిటయ్యా వెధవగోడవ.

మ:—మీకంతచిరా కెందుకండీ ?

వి:—(నవ్వుతూ) ఈ ఊళ్లోవాళ్లు - యితన్ని సరిగా గౌరవించలేదు.

మ:—అలాగా ? పాపం !

శ్రీ:—మీకనికరం నామీదే వెళ్లబుచ్చకండి. మీకూ దానవసర మొస్తుంది.

మ:—ఏం అలా అన్నారు ?

శ్రీ:—మీ అమ్మాయి యింకా రాలేదుగా, ఈ ఊరెంతో నచ్చి నట్టుందికూడా ఆ పిల్లకి.

మ:—దాని మొహం దానికేం తెలుసు ? కొత్తంటె వింతకాదూ ? అందుకే చూస్తూ ఉండిపోయింది. ఈపాటి కొస్తూఉంటుంది లెండి.

శ్రీ:—(ఆకాశంకేసి చూపెట్టి) సూర్యుడెంత కిందకి దిగాడో చూశారా ? సూర్యాస్తమయం అయీ అవడంతోటే ఆ తలుపు పడి పోతుంది. అప్పుడవతలవాళ్లవతలే యివతలవాళ్ళివతలే.

మ:—(కోపంగా) లావణ్యవతలుండి పోతుందనా మీరనేమిక్కా ? మీరేదో తగుమనిషనుకున్నా ...

శ్రీ:—నే తగుమనిషినికాదు. తగుమనిషి నవెక్కడా చెప్పుకోనూ లేదు. నేవ్యాపారస్తుణ్ని.

వి:—మళ్ళీ మనఊరెలా చేరుకోడమో మీరేమేనా వాకబుచేశారా?

మ:—చేశా. ఆ భోగట్టా తెలుసుకునేవాళ్ళతో అన్నా : "మీ ఊరొచ్చినందు కిదొక్కటీ ఉపయోగమైనపని జరిగింది" అని. నే అలా అనడం వాళ్లకి నచ్చలేదనుకోండి.

శ్రీ:—నేనూ తెలుసుకున్నా ఆ భోగట్టా.

భా:—(లేచి మిగతావాళ్ల దగ్గరకొచ్చి) నే అడిగినా చెప్పారు కారేం ?

మ:—మీ ఆయనతో చెప్పంటూరు.

భా:—ఆయనడిగారో లేదో? ఆయనకీ ఊళ్లో ఉండిపోవాలనుందేమో?

మ:—మీకో ?

భా:—నాకు దీనిపేరు చెపితే మంట.

వి:—మీరూ మాతో వద్దురుగాని రెండి.

[రామమోహన్ గుమ్మంలోంచి ప్రవేశించి స్తంభాన్నానుకు నిలబడతాడు. అతను మిగతావాళ్ళనీ వాళ్ళతన్నీ చూస్తారు]

శ్రీ:—ఏమయ్యా నువ్వా బైటకొచ్చేశావ్ ?

వి:—(వేళాకోళం చేస్తూ) చివరకి నువ్ కోరినలాంటి ఊరు దొరికిందా ?

రా:—(నెమ్మదిగా) నే కోరినలాం టిదే కా దంతకు మించుం దీఊరు.

భా:—మళ్ళీ వాదనకి మొదలా ? ఊరుకుందురూ బాబూ, వాదన్లు వినివిని నా తల బద్దలైపోతూంది.

రా:—వాదన నాకూ వద్దు.

శ్రీ:—ఎప్పుడూ వాదిస్తూ ఉండేవాడి వీవే ళేమొచ్చిందేం ?

రా:—ఈవేళ నేనో అపురూపదృశ్యం చూశా. దేన్ని చూడగలుగుతానని నే ఆశ విడిచిపెట్టానో—ఆ దీవేళ నా కళ్లపడింది.

వి:—ఏమి టాకళ్లబడింది ? ...

రా:—యావన్మంది ప్రజలూ సుఖంగా, సంతోషంగా, అన్యోన్యంగా బతుకుతూన్న ఓ మహాపట్నం. నాగరికతం టే యీ వూళ్ళోనే ఉందని పిస్తుంది, దాన్ని చూస్తే.

వి:—నీ కక్కడున్నంతసేపూ సరదాగా ఉందనా దాన్ని పొగుడుతున్నావ్ ?

రా:—అలాంటి ఊరు చూశా గనకనే సంతోషంగా ఉన్నా—అప్పుడూ యిప్పుడూ కూడా.

మ:—వాదనొద్దనీవాడవయితే దాన్నిట్టే పొగడకు: ఎంచేతంటే మేం ఎవ్వరం నీతో ఏకీభవించం.

రా:—(వాళ్ళ నలుగురినీ ఒకళ్ళ తరువాతొకళ్ళని చూస్తూ) మీరేకీభవించరని నాకు తెలుసు.

శ్రీ:—ఉన్న దొడ్డులుకోమంటే ఎవరొద్దులుకుంటారయ్యా, లేని వాళ్ళు లేనికి పడితే దానికి సిద్ధంకాని.

రా:—అవును, నే లేనివాడనే.

శ్రీ:—ఆ ముక్క నే అన్నానా ?

రా:—ఎవరంటే మాత్ర మందులో తప్పేముందయ్యా ? అది కాగ మీకీఊరు నచ్చకపోడానికి కారణమేమిటంటే - మీరు నలుగురూ పూర్వ కాలపు మనుష్యులు.

శ్రీ:—నేపూర్వకాలపు మనిషినైతే యీ రోజులలో వ్యాపార మెలా నడుపుతున్నానోయి ?

భా:—(కోపంగా) నేపూర్వకాలపు మనిషినా ?

రా:—మీరు పూర్వకాలపు వాళ్లంటే నాఉద్దేశం, "మనకుందిగా ఒకళ్లెలా ఏడుస్తే మనకేం" అనుకునే వాళ్లని.

మ:—(కోపంగా) నే ఎప్పుడూ అలా అనుకోను.

వి:—వాద నొద్దనుకున్నామా ?

రా:—సరే వాదనొద్దు. (మహాలక్ష్మమ్మతో) నీమాట పూర్తి చెయ్యమ్మా.

మ:—(గంభీరంగా) ఒకళ్లు బాధపడుతూంటే నేచూస్తూ ఊరు కున్నాననా నువ్వంటున్నావ్ ? నువ్విలా అనడం చాలా అన్యాయం. నేఎందరికో సాయపడ్డా, ఎన్నో దానధర్మాలుచేశా. బీదవాళ్లకి సాయం చెయ్యడం నావిధనుకుని చేశాకాని ఇంకొకళ్లు ప్రోత్సహిస్తే చెయ్యలేదు. నీకు తెలియదుగనక చెప్తున్నా.

రా:—సరేనమ్మా, నీకు దయాదాక్షిణ్యాలులేవని నే అన్నానా ? ఈ ఊళ్ళోవాళ్లు నీలాంటివాళ్ళ దయాదాక్షిణ్యాలు నమ్ముకోవలసిన పనిలేదు. యావన్మందీ సుఖంగా బతకడానికి వీలయేట్ట్లు - వాళ్ళ జీవిత ఫక్కీ ఏర్పరుచుకున్నారు. ఇది మీ కర్థంకాలేదు సరికదా, దీని వాసనే మీరు కిట్టలేదు. మేడల్లోనూ మిద్దెల్లోనూ మీరు కూర్చునుంటే-ఆ చుట్టు పక్కల, వేలాదివేల జనం, పంటలుపోయి, పనులు దొరకక, అన్నానికీ

గుడ్డకీ మొహంవాచి, ఆకలితో ఏడుస్తూన్న పిల్లలకేనా తిండి పెట్టలేక అష్టకష్టాలూ పడుతూంటే - మీకు చీమ కుట్టినట్టేనా ఉండదు. పాడి పంటలకి పేరుపొందిన బెంగాల్ దేశంలో-తిండిలేక-ముప్ఫైలక్షల మంది చచ్చిపోయారంటే - వీళ్లకి తిండెందుకు లేకపోయింది, వీళ్లెందుకు చచ్చి పోయారన్న చింతేనా మీకు లేదు. మీరు పూర్వకాలపు వాళ్లంటే నా భావ మిది.

శ్రీ:—ఆగాగు, నా స్వంతవ్యాపారం నే చేసుకోవడం తప్పా?

రా:—నువ్వు చేస్తూన్నది వ్యాపారం కాదు-దోపిడి. ఆ సంగతి నీకూ తెలుసు.

వి:—(నవ్వుతూ) శ్రీకాంతయ్యా, యీ ఊళ్లో వాళ్లేమన్నారయ్యా? ఆత్మ శ్రేయోభిలాషతో ఏం చేస్తూంటావన్నారు?

శ్రీ:—(కోపంగా) మళ్ళీ ఎందుకయ్యా ఆ గొడవ? అయినా, నీ విషయంలో యితనన్నది నిజం. నువు పూర్వకాలపు మనిషివే.

వి:—నే కాదన్నానటయ్యా? అదో మెప్పకిందే తీసుకుంటా.

శ్రీ:—ఊరేగింపు బొమ్మనిపించుకోడం—అదీ మెప్పే కాబోలు!

మ:—ఊరేగింపు బొమ్మేంటండీ?

శ్రీ:—ఆ సినీమానటి మిమ్మల్నీ చేర్చిం దా క్లాసులో.

రా:—జ్యోతిక్కడి కొచ్చిందా?

వి:—వచ్చి, మమ్మల్ని తలోమాటా అనిపోయింది. (రామమోహన్‌తో) అబ్బాయీ, నువ్వేం జాగర్తపెడతావో—దానికి కోపమొస్తే ఒళ్ళు తెలియదు సుమా.

రా:—నన్ను వెతుక్కుంటూ యిక్కడి కొచ్చిందా?

భా:—అవు నెవరివాళ్ళకోసం వాళ్ళు వెతుక్కుంటూనే ఉన్నారు.

శ్రీ:—నే ఎవరికోస మిక్కడ కూర్చుంట? రాజాబహద్దుర్, మనం బైలుదేరదామా?

భా:—కాస్సే పాగండి, శ్రీకాంతయ్యగారూ. మా ఆయ నొచ్చాకంతా కలిసి వెడదాం.

వి:—ఆట్టే సేపాగం. ఒక్క పావుగంటాగుతాం. (శ్రీకాంతయ్య మహాలక్ష్మమ్మలతో) రెండో గోపురందాకా నడిచొద్దా మొస్తారా?

మ:—లావణ్యోస్తుందేమో యీ లోపున?

వి:—వస్తే యిక్కడుంటుం దేమైపోతుందేం? ఏం, శ్రీకాంతయ్యా సందేహిస్తున్నావ్?

శ్రీ:—ఈపాడు గోడలచుట్టూ తిరిగేం లాభమయ్యా? పోనీపద, నీకంతగా నడవాలనుంటే.

[అని విశ్వేశ్వరరావు, మహాలక్ష్మమ్మ, శ్రీకాంతయ్య వెళ్ళిపోతారు.]

రా:—మళ్ళీ వెనక్కెళ్ళడం కష్టంసుమా.

భా:—కష్టానికేముంది? శ్రీకాంతయ్యగారికి దారి తెలుసుగా?

[సీతారామమ్మ గుమ్మంలోంచి ప్రవేశిస్తుంది.]

రా:—(ఆవిడ కెదురెళ్ళి) ఏం పిన్నీ నువ్వొచ్చేశావ్? వీళ్ళకి నచ్చకపోతేపోయె నీకూ నచ్చక పోయిందా యీ ఊరు? పైవాళ్లేం బాధపెట్టానాడుదరి వచ్చేశావు చెప్పు.

సీ:—(నవ్వుతూ) నీలెక్చరు పూర్తిచెయి, తరువాత చెపుతా.

భా:—అతనిమాటలు లక్ష్యం చెయకండి, సీతారామమ్మగారూ. మళ్ళీ మనఊరు చేరుకోవడ మెలాగో శ్రీకాంతయ్యగారు తెలుసుకున్నారులెండి. మనమంతా కలిసి వెడదాం.

సీ:—కానయితే నువ్వొప్యాయంగా పిలిచావుకాని నే యీ ఊళ్లో కెడుతున్నా నమ్మా, కూరలసంచీ పట్టుకు పోదామనొచ్చా—నిక్షేపం లాంటి కూరలెందు కొదిలెయ్యాలీ?

రా:—(సంతోషంగా) నువ్ నాకు నచ్చావు, పిన్నీ.

సీ:—(నవ్వుతూ) చివరకేనా నచ్చాగద!

భా:—మీరిక్కడుండిపోతే మీవాళ్లేమైపోతారో ఆలోచించారా?

సీ:—ఏమీ అయిపోరమ్మా. అంతా పెరిగి పెద్దవాళ్లయారు. వాళ్ళ బతుకువాళ్ళు బతకగలరు.

భా:—మిమ్మల్ని పనికిపెట్టుకున్నవాళ్ల నర్ధాంతరంచేసి వెళ్ళిపోతారా?

సీ:—అర్థాంతర మేముందమ్మా? నాకిచ్చినదానికి నాలుగురెట్లు చాకిరీ చెయ్యనే చేశా. ఇక ముందు వాళ్లపని వాళ్లనిచేసుకోనీ - వాళ్ల కొవ్వేనా కరుగుతుంది.

భా:—మీరూ మాట్లాడతారనుకోలేదు, సీతారామమ్మగారూ.

సీ:—(నెమ్మదిగానే) నువ్వనుకో పోవచ్చమ్మా. నా మనసులో మాట నే చెప్పడానికేం?

రా:—ఆమాట పూర్తిగా చెప్పు, పిన్నీ.

సీ:—ఏముంది నాయనా చెప్పడానిక్, నేయీ ఊళ్ళో చూసింది తప్ప. విదుస్తే? నే అక్కడ నిలబడుంటే ఓ ఆవిడ నన్ను పలకరించి, 'ఏమండీ. మా ఊరెలా ఉం'ద నడిగింది. నే అన్నా, 'బాగున్నాయమ్మా, మీ ఊరూ మీ బతుకు తీరూను. మనుష్యులు బతకవలసిన మోస్తరే యిది.' చక్కగా ముస్తాబయి, బంతుల్లా ఎగురుతూ ఆడుకుంటూన్న వాళ్ళ పిల్లల్ని ఎంత సేపు చూసినా నాకింకా చూడాలనిపించింది. వాళ్ళ తల్లు లే మంద మైనవాళ్ళు! ఎంత బాగున్నాయి వాళ్ళ పువ్వులతోటలు! వాళ్ళెంత సంతోషంగా బతుకుతున్నారు! నే ఓ ఆవిడతో "అన్నీ మీరే చేసు కుంటున్నారు, నాకూ ఏదేనాపని చెప్పం' డన్నా. "ఈ వయస్సులో మిమ్మల్నెందుకు శ్రమపెట్టాలి, సీతారామమ్మగారూ, మీరీతోటలో కూర్చోండి. మీ కోపికుందా చుట్టుపక్కలవి చూసిరం" డంది. వాళ్లెంత మంచివాళ్లో చూడండి. (కొన్సేపాగి) నే చిన్నప్పుడో కలకన్నా, కలలో యిలాంటిఊరే చూశా. అఊళ్ళో-యిలాంటివే యిళ్లూ, తోటలూ, నవ్వుమొహాలతోఉన్న జనాన్నీ - చూశా. మెలుకొవొచ్చాక యిలాంటి ఊరెక్కడేనా ఉంటుందా అనాశ్చర్యపడ్డా. నేచూసిందుత్త కలకాదు. ప్రత్యక్షంగా ఆ ఊరిక్కడుంది (కొన్సేపాగి) భాగ్యేశ్వరీ, వెళ్ళొస్తా నమ్మా. (రామమోహన్‌తో) నే వెళ్ళొస్తా నబ్బాయీ, దారిలో గట్టూ పుట్టా చూసుకెడుతూండు.

రా:—(నవ్వుతూ) అలాగే, పిన్నీ.

[సీతారామమ్మ కూరలసంచీ పైకెత్తి చంకనిపెట్టి రామమోహన్‌కేసి చూసి నవ్వుతూ వెళ్ళిపోతుంది]

భా:—మీపిన్ని కీఊరు నచ్చిందని నీకు సంతోషంగా ఉందికాబోలు!

రా:—అవును నాకు సంతోషంగానే ఉంది.

భా:—(అసహనం ఒక్కసారి చూపెడుతూ) నువ్వూ ఆవిడవెనకా వెళ్ళకిక్కడ కూర్చున్నావేం ?

రా:—నే నైటుండాలి.

భా:—ఎందుకోసం ?

రా:—(తలూపుతూ) ఊహు. ఎందుకోసమో నీతో చెప్పటానికి వీల్లేదు.

భా:—ఇంకెవరితో నేనా చెప్పొచ్చా ?

రా:—చెప్పతగ్గ మనిషిని కలుసుకుంటే చెప్పొచ్చు. ఏమో, కలుసుకుంటానో లేదో...పోనీ కాని, నువ్వా వెంకట్రావుని...వాడిబతుకు వాడ్ని బతకనిస్తావా ?

భా:—(మొహం ముడుచుకుని) నీ మాట నా కర్థంకాలేదు.

రా:—నీ మాటే నీదికాని, ఒకళ్ళమాట లర్థంకావు. నే చెపుతే ఎంతో వెంకట్రావు చెప్పినా అంతే. ఎప్పుడూ నువ్వే గెలుస్తావ్. నువు గెల్చేం ఉపయోగం ? నీకు దక్కేదేముంది—పిచ్చిగా ? ......నీకీమాటలూ అర్థమవడంలేదు కాదూ ?

భా:—(అలా అనాలని) నాకేం అర్థంకావడంలేదు. ఏదో నీ వెఱ్ఱి మొఱ్ఱివాగు డనుకుంటున్నా.

రా:—నీనివల్ల నువ్వు సుఖం కోరుతూంటావో—దాన్ని రెండు చేతులా పట్టుకు నులిపెయ్యాలని చూస్తూంటావేం ?

భా:—(కోపంగా) ఏమిటి నీ నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నావ్ ?

రా:—నీ బాగు కోరి చెపుతున్నా. నీ బతుకు చాలా ప్రమాదస్థితిలో ఉంది.

భా:—ఉంటే ఉందిలే నీకెందుకు? నే అంటే నీ కిష్టముంది గనకనా?

రా:—నువ్వంటే నా కిష్టంలేకపోయినా—ఎవరుకానీ — నిక్షేపం లాంటి బతుకు—చేతులారా ధ్వంసంచేసుకుంటూంటే నే చూస్తూ ఊరుకో

లేను. (గుమ్మంలోంచి క్రిందకు చూసి) వెంకట్రావొస్తున్నాడు. వాడి కాళ్ళూ చేతులూ కట్టేసి ఎంత చప్పున లాక్కుపోతావో.

[అని గుమ్మంలోంచి వెళ్ళిపోతాడు. కాస్సేపటికి గుమ్మంలోంచి వెంకట్రావొస్తాడు.]

వెం:—(భాగ్యేశ్వరిని సమీపించి) ఇంతసేపూ ఎక్కడున్నావు, భాగ్యం.

భా:—మీకోసమిక్కడ పడిగాపులుపడి కూర్చున్నానండీ.

వెం:—నువ్వొచ్చాశాపుకాని ఆ ఊరెంత బాగుందనుకున్నావ్. వాళ్లెంత మంచివాళ్ళనుకున్నావ్.

భా:—ఆ గొడవంతా ఎందుకు మనింటికి మనం పోదాం రండీ?

వెం:—మళ్ళీ మనింటికి చేరుకోవడం ఎలా?

భా:—శ్రీకాంతయ్యగారికి దారి తెలుసు, ఆయనతో మనమూ వెడదాం.

వెం:—వద్దు, భాగ్యం, మన మీఊళ్ళో ఉండిపోదాం. నీకూ నచ్చేదే యీఊరు, నువు పూర్తిగా చూసుంటే.

భా:—నేచూసింది చాలదూ? ఇంకా చూడాలీ? ఈ దిక్కుమాలిన ఊళ్లో అడుగెట్టడమే తప్పు.

వెం:—(విచారంగా) పోనీ, భాగ్యం, నీ కీఊరు నచ్చకపోడానికి ఫలానా కారణమేదేనా ఉందా?

భా:—(మండిపడుతూ) అక్కడ జ్యోతుయ్యాలలూగుతూంటే చూడడం మీకు సంబరంగా ఉంది కాబోలు!

వెం:—జ్యోతెక్కడుయ్యాలలూగిందో నేచూడనేలేదు. భాగ్యం, మన కావిడగొడవెందుకు, నీకెందుకు నచ్చలే దీఊరు?

భా:—ఏమిటండీ యీఊళ్లోవాళ్ళ వాలకం? ఏమిటా నవ్వులూ, ఆ వేళాకోళాలూ, ఆ ఆటలూ పాటలూ?

వెం:—వాళ్లు సంతోషంగా ఉంటే తప్పేం?

భా:—వాళ్ళకేం మర్యాద తెలియదండీ. అక్కడందరూ సమానులేట!

వెం:—కాదు, భాగ్యం, వాళ్లూ గొప్పవాళ్ళని గౌరవిస్తారు. మనం గొప్పవాళ్లు గొప్పవాళ్ళని డబ్బున్నవాళ్ళ వెనకాల తిరుగుతాం. వాళ్లలో గొప్పవాళ్ళు, మహాకవులూ, శాస్త్రవేత్తలూ, పరిశోధకులూ—ఇలాంటి వాళ్ళు. వీళ్లనక్కడ నెత్తిమీద పెట్టుకు పూజిస్తారు, మన సంఘంలో వీళ్ళబాగోగులే తెలుసుకోం. ఆఊళ్ళో...

భా:—(మాటకడ్డొచ్చి) చాల్లెండి, మీరొక్కరే చూశారా యీ ఊరు? నేచూడలే ?

వెం:—నువ్ చూసీ చూడనివాళ్లలోనే జమ.

భా:—ఎంచేత ?

వెం:—ఆదికిముందే యిదే పాడుఊరనుకుని బైలుదేరావు గనక. ఈ ఊరుమీద, యిక్కడ ప్రజలమీద నీకెందుకసహ్యంపుట్టిందో నాకు బోధపడ్డంలేదు. మొదట్లో నాకూ అన్నీ చిత్రంగానే కనిపించాయి. ఒక్కొక్కటీ చూసినకొద్దీ, బోధపర్చుకున్నకొద్దీ, నాకు వీళ్లజీవిత ఫక్కీ నచ్చింది. నువ్వేదీ చూడాలేదు, బోధపర్చుకోనూలేదు, నీకెలా నచ్చచెప్పడం ?

భా:—(కొస్సెపాగి) చివరకేమంటారు ?

వెం:—(కోపంగా) నువు నామనసుకూడా తిప్పేద్దామని చూస్తున్నావు. నాచేతా యిదోపాడు ఊరనిపిద్దామని నీపట్టు. నేచెపుతున్నా, యీవేళ నీపంతం సాగదు. నే దీనికొప్పకోను.

భా:—(హడిలిపోయి) నా మీదసహ్యం పుడుతూందండీ మీకు?

వెం:—(కోపంగానే) పుట్టాలిసిందే. ఒకసారా రెండుసార్లా - ఎన్ని సార్లు నామనసు తిప్పేశావు. నువ్వన్నదల్లా ఎన్నిసార్లు నాచేతా ననిపించావు. నీ ఆట లీవేళా సాగుతా యనుకున్నావా ? (తలుపుకేసి చూపించి కేకలేస్తూ) నా కీఊరు నచ్చింది. సజీవులై బతుకుతున్నా రీ ఊళ్ళోవాళ్లు. మానవౌన్నత్యం యీఊళ్ళోనే కళ్లపడుతూంది. నేనూ వెళ్ళి వీళ్ళకి సాయపడతా.

[అంటూ గుమ్మాన్ని సమీపించి గుమ్మంలోంచి వెళ్ళిపోతాడు. అతను వెడుతూండగా భాగ్యేశ్వరి గోడచేరువ నో మెట్టుమీద కూర్చుని వెక్కి వెక్కి

ఏడవడం మొదలెడుతుంది. కాస్సేపు పోయాక వెంకట్రావు గుమ్మంలోం
చొచ్చి ముందుకీ వెనక్కీ సందేహిస్తూన్నట్టడుగులేస్తూ భాగ్యేశ్వరిని
సమీపించి ఆవిడ ప్రక్కని కూర్చుంటాడు]

వెం:—ఏడవకు, భాగ్యం, ఊరుకో.

భా:—(ఏడుస్తూనే) నన్నొదిలేసి వెళిపోదా మనుకున్నారా ?

వెం:—వెళ్లలేదుగా, మళ్లీవచ్చాగా.

భా:—(కొంచెం శాంతపడి) మీకు నామీద ప్రేమే ఉంటే...

వెం:—ఉంది, భాగ్యం.

భా:—ఉంటే నన్నొదిలి వెళిపోకురా. నే ఎప్పటికేనా మిమ్మల్నొ
దలగల్గునా ?

వెం:—మళ్ళీ వచ్చాగా.

భా:—(కళ్ల నీళ్లు తుడుచుకుంటూ) నే బుద్ధి తక్కువదాన్నే అను
కోండి. మీకాళ్ళకి బంధంలా ఉన్నానే అనుకోండి. నే ఏంచెయనూ ?
ఒక్కొక్కప్పుడు నామీద నాకసహ్యం పుడుతుంది. చచ్చిపోతే
బాగుండుననిపిస్తుంది. దారిత ప్పిక్కడికి రావడం - ముక్కూ మొహం
ఎరగనివాళ్ళతో మాట్లాడడం - మీమనసు నా మీదుండనివ్వకుండా
తనవే పేఊరు తిప్పకుంటూంటే ఏం చేయలేకుండా చూస్తూనిలుచోడం-
దీన్నా దాన్నా, నామనసు చాలా కష్టపడుతుందండీ. మీరు చెపితే
నమ్మరుకాని...

వెం:—ఏమో, భాగ్యం, నాకీఊళ్ళో ఎంతో సంతోషంగా ఉంది.
మళ్ళీ మన ఊరెళ్ళేలా ఉంటానో ?

భా:—(సంతోషంగా) మళ్ళీ మన ఊరొస్తారా ?

వెం:—(విచారంగా) వస్తా పద.

భా:—వస్తారండీ (అని సంతోషం పట్టలేక మొగుడ్ని దగ్గరకు తీసు
కుంటుంది) మీ భాగ్యమంటే మీకేం అభిమానం ! నన్నొదిలి వెళిపోతా
రేమో అని దిగులుపడ్డా సుమండీ. మీరెళిపోయుంటే నే బెంగెట్టుకు
చచ్చిపోదును.

వెం:—నిన్నొదిలేసి వెళడం నా ఉద్దేశమూ కాదు. నే కింద కెడితే నువ్వూ నా వెంటొస్తావేమో అని చూశా. నీ అభిప్రాయం మార్చుకుంటావేమో అనాశపడ్డా.

భా:—నా అభిప్రాయమెలా మార్చుకోనండీ ?

వెం:—అవునులే, నీ అభిప్రాయాలు మారేవికావు...ఏమో, మన ఊరెళ్లాక నాకేం సుఖముంటుందనుకోను.

భా:—(ఉత్సాహంగా) నే మిమ్మల్ని సుఖపెడతా. చూర్దురుగా నీవేళ చూసినవన్నీ మరిచిపోయేలా చేస్తా. మీ కిష్టమైన వాటిమీద నా మనసూ పెడతా. మేష్టర్ని పెట్టింగ్లీషు నేర్చుకుంటా. మనం అడయారులో ఓ బంగాళా తీసుకుందాం. అక్కడ గొప్పగొప్ప వాళ్లందరితోనూ స్నేహం చేద్దాం. మీకో పెద్ద పనికావాలంటే శ్రీకాంతయ్యగారివ్వగలరు. నన్నడిగి చూడమంటే చూస్తా - లేదు మీరడుగుతేనే బాగుంటుందంటే మీరే అడగండి.

వెం:—నే శ్రీకాంతయ్య దగ్గరమాత్రం పనిచెయను.

భా:—ఏం, పెద్ద జీతమిస్తానంటే.

వెం:—నే అతనిదగ్గర పనిచెయ్యను. నువ్వు మళ్ళీ అడుసెత్తావంటే యీఊళ్లో కెళిపోతా.

భా:—(సమాధానపడి) పోనివ్వండి మీకిష్టంలేకపోతే.

[రామమోహన్ గుమ్మంలోంచొస్తాడు]

రా:—సరీగా వేళకొచ్చానా.

వెం:—(చిరునవ్వుతో) వచ్చావు.

భా:—(రామమోహన్‌తో సంతోషంగా) శ్రీ కాంతయ్యగారు రావడంతోటే మేమూ వెడుతున్నాం.

వెం:—(రామమోహన్‌తో) ఏం నువ్ బైటికొచ్చేశావ్ ? నీ కీఊరు నచ్చిందిగా ?

రా:—నే బైటుండాలి. నువ్వేమిటూ ఊళ్లోవాళ్ల నలా నవ్విస్తున్నావ్ ? నీచుట్టూ ఎందరు పోగయ్యారో చూశావా ?

వెం:—ఏమీలేదు. మన ఊళ్లో వెయ్యిరూపాయిల నోట్లకి లెక్కచెప్ప మనలే. అప్పుడు జరిగిన చిత్ర విచిత్రాలన్నీ వాళ్లతో చెప్పా.

[శ్రీకాంతయ్య ప్రవేశిస్తాడు]

శ్రీ:—ఎంతసేపటికీ రారే—ఆ విశ్వేశ్వరరావూ మహాలక్ష్మమ్మా! ఏదో సోదిపెట్టుకు కూర్చుంటూరు. నే ఎందుకాగడం? నే వెళ్ళిపోతా.

భా:—శ్రీకాంతయ్యగారూ, మేమూ మీతో రామా?

శ్రీ:—వస్తే రండి.

[అని వెళ్ళిపోతాడు]

భా:—(వెంకట్రావుతో) రండీ, శ్రీకాంతయ్యగారితో వెడదాం.

వెం:—(రామమోహన్ భుజంమీద చెయ్యివేసి) నే వెళ్లొస్తా, రాం.

రా.—వెళ్లిన్నా వెళ్లు. నువ్వీఊళ్లో చూసింది మరచిపోకేం. నిత్యాగ్నిహోత్రంలా దాన్ని కాపాడుకోవాలి సుమా.

వెం:—అలాగే, రాం.

రా:—నువ్వు మనస్తాపపడకన్నా. నేను మళ్ళీవచ్చి నిన్ను కలుస్తాగా!

భా:—(మొగుడి చెయ్యి పట్టుకు లాగుతూ) రండీ, ఆయనప్పుడే ఎంతదూరం వెళ్ళిపోయారో.

వెం:—(తనూ, భాగ్యేశ్వరి నడుస్తూఉండగా) వెళ్ళొస్తాను, తమ్ముడూ, వెళ్ళొస్తా.

[అని చెయ్యెత్తి ఊపుతూ వెళ్ళిపోతాడు. రామమోహన్‌కూడా చెయ్యెత్తి ఊపి అతను వెళ్ళినవేపే చూస్తూ నిలబడతాడు. ఇంతలో లావణ్య గుమ్మంలోంచొచ్చి అతన్ని సమీపిస్తుంది]

లా:—ఏం, రామమోహన్, ఆ వెడుతూన్నవాళ్ళలో మా అమ్మ ఉందా?

రా:—లేదు; వాళ్లు శ్రీకాంతయ్య, వెంకట్రావూ, భాగ్యేశ్వరీని.

లా:—ఈ ఊరు వాళ్ళెవరికీ నచ్చలేదు కాబోలు!

రా:—శ్రీకాంతయ్యకీ భాగ్యేశ్వరికీ నచ్చలేదు కాని వెంకట్రావుకి నచ్చింది. వెంకట్రావు మనలోవాడే.

లా:—మా అమ్మెక్కడుంది ?

రా:—మీ అమ్మా విశ్వేశ్వరరావూ కలిసి షికారెళ్ళారు. ఉభయులూ కలిసినపాటికి—డొంకినవలస రాజా నాలుగో పెళ్లా మైనప్పుడు పురిటికీ—డాక్టరు లక్ష్మణస్వామిని పిల్చారా, డాక్టరు వెంకటగిరిని పిల్చారా ? అన్న సమస్య విడగొడుతూ ఉంటారు.

లా:—(నవ్వుతూ) అవునులే. మీ ఆవిడేది ?

రా:—మా ఆవిడెవరు ?

లా:—ఎవరేమిటా జ్యోతిర్మయి.

రా:—జ్యోతిని మా ఆవిడకిందే కట్టేశావా ?

లా:—నే కట్టేసిందేముందీ ? అందరికీ తెలిసిందేగా ఈ విషయం? నువ్విక్కడ—మీనం మేషం లెక్క పెడుతూ కూర్చోకపోతే, ఆవిడెక్కడుందో చూచిరాకూడదూ ?

రా:—నే నిక్కడుండవలసిన పనుంది.

లా:—ఏమో నీ వైఖరీ నాకు నచ్చలేదు, నీ ప్రయోజకత్వం—మాటల్లోనే కాని క్రియలలో కనపడదేం ?

రా:—నే నిట్టుండవలసిన కారణముంది. అయినా, నా గురించి నువ్వేం బెంగపెట్టుకోకు.

రా:—నా కెవరిగురించీ బెంగలేదు.

"నయన మనోమోహనమే
సుందరమే చెలి సురుచిరమే"

[అని పాడుతుంది]

రా:—పాట బాగుందికాని నాకు పూర్తిగా వినే అదృష్టంలేదు. మీ అమ్మొస్తోంది.

[అని గుమ్మంలోంచి కిందకిదిగి వెడతాడు. మహాలక్ష్మమ్మ ప్రవేసిస్తుంది]

మ:—అమ్మాయీ, పొద్దోయిందిక బైలుదేరదామా ? (తల్లీ కూతుళ్లు ఒకళ్ళమొహా లొకళ్లు చూసుకుంటారు. కాస్సేపాగి) ఏం, మాటాడవేమే?

లా:—నాకీ ఊళ్లో ఉండాలనుందమ్మా.

మ:—నీకేం మతిపోయిందా ఏమిటి? నువ్వొక్కర్తివీ ఎలా ఉంటావ్? నే ఈ ఊళ్ళో ఒకరోజుండలేను.

లా:—ఇక్కడుందామని నే నిశ్చయంచేసుకున్నానమ్మా. నీతో ఆ ముక్క చెప్దామనే వచ్చా.

మ:—నే లేనిదే నువ్వేలా ఉంటావే? తిరిగితిరి గలిసిపోయి నువ్వే మంటున్నావో నీకే తెలియకుండా మాట్లాడుతున్నావ్.

లా:—నే అలిసిపోనూలేదు, అసందర్భంగా మాట్లాడ్డమూ లేదు. (కోపంగా) నే ఎప్పుడేం తలపెట్టినా యిలాంటి సాకులే చెప్తూ నువ్వడ్డొచ్చావ్. చిన్నదాన్ననీ, ప్రపంచం తెలియనిదాన్ననీ ఎందులోకీ నన్ను వెళ్లనిచ్చావ్ కావ్. నే చిన్నదాన్ని కాదు, ప్రపంచం తెలియని దాన్నీ కాదు, నా బాగు నే చూసుకోగలను.

మ:—నే తల్లి నన్న మాటకూడా మరిచిపోయావా ఏమిటే? మీద పడి కరవచ్చినట్టలా మాట్లాడతావేం?

లా:—నీమనస్సు నొప్పెట్టేలా మాట్లాడడం నా ఉద్దేశంకాదు. కాని నేవెనక్కిరాను. వెనక్కెళ్లడంకంటె చచ్చిపోతేనే నయం. ఆ 'సౌందర్యమహల్' లోవాళ్లు బతికుండి ఎవరికే ముపయోగమో నువ్వ చెప్పమ్మా. తినడం - తాగడం - మొద్దుల్లా నిద్దరోడం - గంగిరెద్దుల్లా సింగారించుకు తిరగడం మినహా వాళ్ళు చేస్తూన్నదేముందమ్మా? చెడి పోయిన ఆడవాళ్లగురించీ, వాళ్ళని చెడగొట్టిన మొగాళ్లగురించీ తప్పితే, వాళ్ళు మాటాడుకునే విషయాలేమున్నాయి చెప్పు? అమ్మా, నువ్వ వాళ్ళలాంటి దానివికావు. నీ ఉదయగిరి ప్రయాణంమాట జ్ఞాపకం తెచ్చుకో. ఆరోజుల్లో భయమెలాంటిదో నువ్వెరగవ్, యిప్పుడెందుకు నీ కీపిరికితనం? "కొత్తదారిని వెడదాం రాఅమ్మా" అంటే ఎందు కంతగా సందేహిస్తావ్?

మ:—ఇంతవయస్సొచ్చి యిప్పుడు కొత్తదారేమిటే? మీనాన్నేనా లేరాయె. నే ఒక్కర్తెనూ అయిపోయానా? ఆ యింటిగౌరవం నిలబెట్టు కుంటూ బతుకుదామనే కానీ:...

లా:—(మాటకడ్డొచ్చి) నీకుమాత్ర మీబతుకులో సుఖమేముందమ్మా? ఏం సంతుష్టుంది చెప్పు. నే నీతో వెనక్కొస్తే - బతకడానికని కాదు రావడం - నిర్జీవప్రతిమలా పడుండడానికనీ, యీ ఊరు చూశాక - యిక్కడివాళ్లెలా బతుకుతున్నారో తెలుసుకున్నాక - నేమళ్ళీ వెనక్కి రావడ మసంభవమమ్మా. అన్నిటి మాటకేం కాని, యీ ఊళ్ళో పిల్లల్ని చూడు. ఇలాంటి పిల్లల్ని నువ్వెక్కడేనా చూశావా? వాళ్లనిచూస్తూ నిలుచునుంటే - అకస్మాత్తుగా - నాలో ఏదో కదలికపుట్టి - ఎక్కడ లేని జవసత్త్వాలూ నాకొచ్చాయమ్మా. నే అక్కడివాళ్లతో 'మీ రేం చెయ్యమన్నా చేస్తా, నన్నిక్కడుండిపోనివ్వం' డన్నా. 'అలాగే ఉం' డన్నారువాళ్లు. వాళ్లెంత మంచివాళ్లనుకున్నావ్? అమ్మా నేచెప్తూన్నది నీకర్థమవుతూందా?

మ:—అర్థంకాకేమే? ఇన్నాళ్ళూ నాతో ఉండి నీకు విసుగ్గా ఉంది. ఇప్పుడీ కొత్తఊరు విచిత్రంగా కనపడుతూంది. 'అమ్మమాత్ర మేం చేస్తుంది? ఎన్నివిధాల నన్ను సంతోషపెట్టాలని చూడ్డంలే' దన్నమాటే నీకుంటే...

లా:—అవునమ్మా నువ్వు నాకోసం చాలా శ్రమపడ్డావు. నే యీ ఊళ్ళో ఉంటాననడం నీమీద విసుగుపుట్టికాదు. నే ఆలోచించే...

మ:—(మాటకడ్డొచ్చి) నువ్వు బాగా ఆలోచించే మనిషివే అయితే ఒక్కర్తినీ నన్నొదిలి వెళ్ళిపోదామని ఎలా అనుకున్నావ్?

లా:—నిన్నొదిలి వెళ్ళిపోతానని నే ఎప్పుడన్నా. మనిద్దరంవె ళ్ళీఊళ్లో ఉందాంరా అమ్మా. ఎన్నోసారులు నే నీమాట విన్నానా? ఈ ఒక్కవిషయంలోనూ నామాటవిను, అమ్మవు కాదూ.

మ:—(చిరాకుగా) దేనికేనా పట్టూ విడుపూ ఉండాలి. ఏదో కొత్త ఊరు చూడ్డంతోటే అక్కడి కెళ్ళుండిపోవడమేనా? నలుగురూ వింటే ఏమంటారు? కూతురికి తెలియకపోతే తల్లికేనా తెలియొద్దా అనడగరూ?

లా:—(కోపంగా) ఎంతసేపూ వీళ్లేమంటారో వాళ్లేమంటారో అన్న మాట కాని, యిదిమంచి యిదిచెడ్డ అని నీకు నువ్వాలోచించుకోడం

లేదటమ్మా ? ఆ 'సౌందర్య మహ' ల్లో వాళ్లామనకి చెప్పేవాళ్లు ? వాళ్ల అడుగు జాడలలోపడి నువ్వెందుకు పోవాలమ్మా ? నువ్వా నాతోరా, నిన్నొక్కర్తినీ ఒదిలేసి వెళ్లడం - నాకూ కష్టంగా ఉంది.

మ:—అందుకే నామాటవిని మన ఊరెళ్లిపోదాంరా, నిన్ను కనీ, పెంచీ, పెద్దదాన్ని చేసిన తల్లి చెపుతూందనేనా యీమాట విను.

లా:— (మాటకడ్డొచ్చి, నెమ్మదిగా) కనీ, పెంచీ, పెద్దదాన్ని చెయ్యడం బతకమనా మట్టిబొమ్మలా పడుండమనా ? నా బతుకు నన్ను బతకనీ, నే వెళ్లొస్తానమ్మా.

[అని తల్లిని కౌగలించు కుంటుంది.]

మ:—(కళ్లనీళ్లు కారుస్తూ) నన్నొదిలి వెళ్ళిపోతావే ? నే యింత వయస్సొచ్చి ఎలామారనే ?

[అని కూతుర్ని విడవదు.]

లా:—(తల్లి కౌగిటిలోంచి తప్పించుకుని) నాకు సెలవియ్యమ్మా, నే వెళ్లొస్తా.

[అని గుమ్మంలోంచి దిగి వెళ్ళిపోతుంది. మహలక్ష్మమ్మ తన్ను తా నోదార్చుకుంటుంది. కొంతసేపటికి అప్పుడు విశ్వేశ్వరరావు ఎడమవేపు నుంచొస్తాడు. తరువాత గుమ్మంలోంచి రామ మోహనొస్తాడు.]

వి:—ఏమండీ, మహలక్ష్మమ్మగారూ, బైలుదేరదామా ?

మ:—అలాగే.

వి:—(రామమోహన్‌తో) ఇంకా నువ్విక్కడుంటావా ?

రా:—ఉంటా.

వి:—సూర్యాస్తమయం కాగానే ఆ తలుపు పడిపోతుంది సుమా. ఆలోపుగానే నువ్ స్థిరం చేసుకోవా లివతలుండడమో అవతలికెళ్లడమో (మహలక్ష్మమ్మతో) మహలక్ష్మమ్మగారూ, వెడదామా ?

మ:—పదండి రాజా బహద్దుర్.

వి:—(ఇద్దరూ ప్రక్క ప్రక్కల్ని నడుస్తూ ఉండగా) భవల్‌పూ గెస్టేటు చిన్నవాటిలో జమా పెద్దవాటిలో జమా ?

మ:—చిన్న దేమిటండీ పన్నెండువేల గ్రామాల ఎస్టేటు.

వి:—నే బొంబాయి దగ్గరున్న ఎస్టేట్లలాంటిదేమో అనుకున్నా లెండి.

మ:—అవెలాంటివి ?

వి:—అక్కడ - ఓ చిన్న గ్రామంలో నే-నాలుగే స్టేట్లుంటూంటాయండీ. అక్కడ జమీందార్లకి - రాబడి తక్కువయినా హోదామా ఎక్కువండీ - స్వతంత్ర ప్రభువులని పిలుస్తూ ఉంటారు వాళ్లనక్కడ. స్వతంత్ర ప్రభువులంటే ఏమనుకున్నారూ ? ఢిల్లీ రాజ్యాంగ సభలో వీళ్లకి తొంభైమూడు సీట్లున్నాయండీ.

[అంటూ ఉభయులూ వెళ్ళిపోతారు.]

[వాళ్ళు వెళ్ళాక రామమోహన్ గోడచేరువ నో మెట్టెక్కి కాస్సేపు ఊరికేని చూస్తూ నిలబడతాడు. ఇంతలో తలుపు నెమ్మదిగా మూసుకుంటూన్న చప్పుడైతే 'ఆగాగు' అంటూ అది పడకుండా తా నడ్డుకోడాని కటువేపు పరుగెత్తుతాడు. ఇంతలో జ్యోతి అతి వేగంగా తలు పవతలనుంచి పరుగెత్తుకొనివచ్చి తలుపింకో క్షణంలో మూసుకుపోతుం దనగా ఇవతలకొచ్చి పడుతుంది. ఆవిడ ఆయాసంతో ఒగుర్చుకుంటూ గోపురాన్నానుకుని నిలబడుతుంది]

రా:—(క్షణంవరకూ ఆతుర్దా, యిప్పుడు సంతోషం కనపరుస్తూ) మెట్లెక్కలా గైతేనేం పైకొచ్చావే.

జ్యో:—(కోపంగా) చూడు నిన్నేంచేసినా పాపంలేదు.

రా:—ఏం, నేనేంచేశా ?

జ్యో:—నన్నక్కడుండనివ్వకుండా లాక్కొచ్చిన వాడవు నువ్ కామా ?

రా:—నీ అంతట నువ్వొచ్చి పైగా నన్నంటున్నావా ?

జ్యో:—అవును, ఎప్పటికేనా ఆడదే బుద్ధితక్కువది.

రా:—అంటే ?

జ్యో:—అంటేలేదు గింటేలేదు, నేయిహ మాట్లాడను.

రా:—జ్యోతీ, ఈ ఊరెంతో బాగుందికాదూ?

జ్యో:—నే యిన్నాళ్ళూ అనుకుంటూ వచ్చిం దిలాంటిఊరు చూస్తా ననే. ఎక్కడో యిలాంటి ఊరుంటుందని నాకు మొదటినుంచీ తెలుసు. అదీవేళిక్కడే ప్రత్యక్షమయింది. ఇలాంటి జీవితఫక్కీ ఏర్పరుచుకునే శక్తి—మనుష్యులలో ఉందని నాకు తెలుసు...పుల్లాకుచుట్టూ మూగిన కుక్కలలా మనం బతుకుతున్నాం కాని—అలా బతకనక్కరలేదు, రాం. మన జీవితంలో సుఖమూ శాంతీ—ఎప్పుడో కానెరగమా—వీళ్లు నిత్యమూ సుఖశాంతు లనుభవిస్తున్నారు, చూశావా?

రా:—చూశా, జ్యోతీ.

జ్యో:—మనం పనికెళ్లడం—యజమానిదగ్గరా నాలుగుడబ్బులూ తెచ్చుకోపోతే పొట్టెలా గడుస్తుంద నేనా? పనిలో మన కాసక్తుందా? ఓ ఉపయోగమైన పని చేస్తున్నామనా?

ఈ ఊళ్ళోవాళ్ల పని తీరే వేరు. వాళ్ళే పెద్దపనైనా—నలుగురూ పూనుకుని నలుగురి చాకచక్యం వినియోగపరుస్తూ—నానాటికీ తమ చేతులలో పెరుగుతూన్న దాన్ని చూసి సంతోషిస్తూ—కడముట్టా నిర్వహిస్తూంటారు. ములుకోలపుచ్చుకు పొడిస్తేనేకాని మనం కదలమా—వాళ్ళు చూశావా, ఎంతాసక్తితో, ఎంత ఉత్సాహంతో, ఏలాం టభినివేశంతో పనిచేస్తూంటారో. మన కటికి దారిద్ర్యానికీ, వాళ్ల ధన ధాన్య సమృద్ధికీ యిదే కారణం, రాం. పొద్దున్న నువ్వేమన్నావ్; "ఏమో ఏం చెప్పం, ఏదీ చూడందే ఎలా నమ్మం?"

రా:—నే పొద్దున్నన్నవన్నీ మరచిపో, జ్యోతీ. నేవచ్చి చూశాగా?

జ్యో:—నే మాత్రం కనిపెట్టలేదనుకున్నావా, నువ్వా ఊరు చూస్తూన్నప్పు డెలాఉన్నావో? అన్నిటి మాటకేం రాం, అక్కడి పిల్లలెన్నెలా మరచిపోగలం?

రా:—మనం ఏదీ మరచిపోవద్దు జ్యోతీ. ఇప్పుడే కాదు, కొస ఊపిరుండేదాకా.

జ్యో:—అబ్బా, నా కాళ్లు పీక్కుపోతున్నాయి, నే యిహ నిలబడలేను.

[అని చతికిలబడుతుంది. రామమోహన్ ఆవిడప్రక్కని కూర్చుంటాడు. జ్యోతిర్మయి అతనిమీద కాస్తానుకు కూర్చుంటుంది. రామమోహన్ ఆవిడ చెయ్యి తన చేతులలోకి తీసుకుంటాడు]

రా:—నీ మాట పూర్తిచెయి, జ్యోతీ.

జ్యో:—పూర్తిచెయడానికింకేముందీ ? ఇక నువు చెప్పు.

రా:— నే చెప్పవలసింది చాలా ఉంది. చెపుతా, కాస్తోపిక పట్టు, నీ మాట పూర్తిచెయి.

జ్యో—రాం, నిన్ను నమ్మిన ఆడదాన్ని అష్టకష్టాలూ పెట్టేవాడివి సుమా.

రా:—నే ఎన్ని కష్టాలు పడాలో నీకూ తెలుస్తుంది. ఏ కష్టాలొచ్చినా—ఆడవాళ్ల గౌరవం నువు నిలబెడుతూ—మొగాళ్ళ గౌరవం నే నిలబెడుతూ నడుచుకున్నామంటే—ఏ మొచ్చి మన్నేంచెయగలవ్ ?

జ్యో:—నే ఈ ఊరు చూడకపోతే ఎప్పటికీ నా మనసులోమాట చెప్పేదాన్ని కానుసుమా. నువ్వేమనుకున్నావో, నే ఎంతో అభిమానపడే మనిషిని.

రా:—నే ఎరుగుదును జ్యోతీ.

జ్యో:—అయితే చెపుతా విను. మనం పొద్దున్న కలుసుకున్నప్పుడు నువు నన్నెంతో ఆకర్షించావు. నాకు పట్టుకున్న విచారమల్లా: "ఇతనికి జేనిలోనూ నమ్మకంలేదే, యితనితో ఎలాగురా దేముడా" అనే. నీ మీద చిరాకుపడి నే వెళ్లిపోయా, జ్ఞాపకముందా ? అదీ యిందుకోసమే. నువు నే కోరిన లాంటి వాడవు కావనే. నువ్వర్థం చేసుకోగలవో లేవో కాని — ఏ ఆడదైనా అర్థంచేసుకుంటుందీ విషయం.

ఆ ఊరు చూశాక నీలో ఎంతో మార్పొచ్చింది. చిన్నతనంలో మీ అమ్మ చెంగట్టుకు తిరుగుతూన్నప్పు డెలాఉండేవాడవో—అలా అన్నీ చూస్తూ, అన్నీ అడిగి తెలుసుకుంటూ, నవ్వుమొహంతో తిరుగుతూన్న నిన్ను చూసి నే మనసారా ప్రేమించా, నువ్వూ నన్ను ప్రేమిస్తూన్నావేమో అన్నాశపడ్డా. ప్రేమిస్తూన్నట్టే కనపడ్డావు కూడా.

రా:—అవును, జ్యోతీ, నే మొదటినుంచీ నిన్ను ప్రేమిస్తూ వచ్చా.

జ్యో:—నిజంగానే ?

రా:—నిజం, జ్యోతీ, నిజం.

జ్యో:—అయితే యింకేం ? (అని సంతోషం కనపరుస్తూ రామమోహన్‌మీద కొరుగుతుంది. రామమోహన్ ఆవిడ్ని దగ్గరకు తీసుకుంటాడు) నే అనుకున్నా, ఊ, ఆచక్కటి వాళ్లని చూశాక నే నీకంటి కానతానా, యిన్నాళ్ళూ బురదలో పొర్లాడుతూన్నదాన్ని నే వాళ్ళ ముందు నిలవడాని కర్హురాలనా ? అని.

రా:—(మాటకడ్డొచ్చి) ఏవిషయంలో నువ్ వాళ్లకి తీసిపోయావు, జ్యోతీ ? అదీగాక నేను బురదలోంచొచ్చినవాడినేగా ? మన ఊరు చూస్తూ ఉంటే నాభావాలు నీకళ్లల్లో ప్రతిఫలించాయి, నీభావాలు నా కళ్లల్లో ప్రతిఫలించాయి ! మనిద్దరమూ మళ్లతోవనిప డీఊరొచ్చాం. ఈ ఊళ్ళోవాళ్ల తోవని నడవలేడే. మనలోమనకి కుదిరిన అన్యోన్యం వీళ్లతో మనకెలా కుదురుతుందీ ?

జ్యో:—(సంతోషం కనపరుస్తూ) మనకీ అన్యోన్యం కుదిరింది గదా అని సంతోషించి దీన్నెంతోకాలం నిలబెట్టుకుంటూ, మన వూళ్ళో బతకొచ్చనుకున్నా. వాళ్లు మన్నుండమన్నారుకూడాను. అందుకనే, నువ్వు నన్ను విడిచివెళ్ళినా నే ఆగుర్దా పడలేదు. ఏయంత్రాలో చూడ్డానికి వెళ్లింటావని చూసి మళ్ళీ వస్తావనుకున్నా. సాయింత్రం పడింది, నువ్వింతకీ రా వంతకీరావు. అక్కడివాళ్లనడిగితే నువ్వెక్కడి కెళ్ళోవో ఎవరూ ఎరగమన్నారు. ఇంతలో సీతారామమ్మగారొచ్చి నువ్విక్కడ నాకోసం కనిపెట్టుకున్నావని చెప్పింది. దాంతో పరుగు

పరుగు నిక్కడికొచ్చా. ఒక్క క్షణం ఆలస్యమయితే లోప లుండిపోయే దాన్నే, ఏమా బైటికెంగుకుండిపోయాడా అని మాచిరాకుపడ్డా. కా నేం చేయను? నే పైకిరాకుండా నిన్ను లోపలికి తీసుకెళ్లడమెలాగ? నువ్వే లేందే నే ఒక్కర్తెనూ అక్కడెలా ఉండిపోనూ - నీతో ఉండాలిసిన దాన్ని కాని.

రా:—అవును, జ్యోతీ, నేకోరింది నువ్వు నాతో ఉండాలనే. అందుకోసమే నువ్వు వస్తావ నిక్కడాగా.

జ్యో:—ఇక్కడాగకపోతే ఊళ్లోకెందుకు రాకూడదూ! ఇక్కడెందుకుండిపోయావ్?

రా:—నువ్వు ఊళ్ళోనూ నే బయటాఉండడం నాకు హితవుకాదు. నువ్వోవేళ లోపలుండిపోతావేమో సూర్యాస్తమయంలోపున రావేమో అన్నభీతి నాకుంది. కాని నే ఏంచెయ్యను? నే ఊళ్ళోకొస్తే మళ్ళీ బైటకి రాగలుగుతానన్న ధైర్యం నాకులేదు. నువ్వేనా నన్నక్కడుంచె యొచ్చు; లేకపోతే, నాకే ఆఊరొదిలిపెట్టడానికి మనసు రాకపోవచ్చు, అందుకోసమే దీన్నంటిపెట్టుకు కూర్చున్నా. అక్కడికీ, నామనస్సు స్వాధీనంగాక రెండుసార్లు కోట్గుదాకానిగి నువ్వొస్తున్నావేమో అని చూశా. కాని మళ్ళీ చప్పున బైటికొచ్చేశా.

జ్యో:—ఏం, నువ్వు బైటకెందుకు రావాలీ? ఈ ఊరెందు కొదిలి పెట్టాలీ? ఇదీ నీకు నచ్చలేదంటావా ఏమిటి, రాం?

రా:—(లేచి తొందరగా) కాదు జ్యోతీ, యీ ఊరు నచ్చక కాదు. ఎవరో ఒకరు వెనక్కెళ్ళొద్దూ?

జ్యో:—(లేస్తూ) ఎందు కోసం వెనక్కెళ్లడం? వెళ్లినవాళ్లు వెళ్లారుగా?

రా:—అవును - శ్రీకాంతయ్యా - విశ్వేశ్వరరావూ - మొగుడ్ని వెంటేసుకుని భాగ్యేశ్వరీ - కూతుర్నికూడా ఒదిలేసి మహాలక్ష్మమ్మా - వెళ్లిపోయారు. వీళ్లు వెళ్లేం లాభం, జ్యోతీ? వీళ్లనక్కడివాళ్లు వారు

చూసిన ఊరెలాంటిద నడిగితే వీళ్లేమంటారు ? అంత ఛండాలమైన ఊరదే కాని ఇంకొకటి లేదంటారా, అనరా? అందుకే యింకొకళ్లు వెళ్లి - నిజస్థితి చెప్పొద్దూ ?

జ్యో:—అవున దవసరమే.

రా:—నే బైటున్నా గనుక నువ్వూ బైటకొచ్చా వన్నావా ?

జ్యో:—నే ఆడదాన్ని గనకొచ్చేశా.

రా:—నే మొగాడ్ని గనక - స్వసుఖం మాత్రం కోరే పశువుని కాను గనుక - నేచూసింది నలుగురికీ తెలియజేయకుండా ఎలా నిద్రపో గలను, జ్యోతీ ? ఇదివరకు - జీవితం తప్పుదారిని వెడుతూందని నాకు తెలుసు, దాన్ని మంచిదారిలో ఎలా పెట్టడమో తెలియదు. అప్పుడు నే ఏం చెప్పేం లాభం ?

జ్యో:—ఇప్పుడు తెలుసుకున్నావు గనుక—

రా:—ఊరూరా వాడవాడా దీన్ని వ్యాపకం చెయ్యాలి. రాత్రనక—పగలనక—మన మెక్కడున్నా—

జ్యో:—అయితే మనం వెనక్కెళ్లడ మెలాగ ?

రా:—మన మిక్కడికెలా వచ్చాం, జ్యోతీ, ఏదో శక్తి మన్నిక్కడికి లాక్కొచ్చింది—మన మెలాంటివాళ్లమో పరీక్ష చేద్దామనీ, ఆ పరీక్షలో మనం నెగ్గుకొచ్చామా, ఆ శక్తే మన్ని వెనక్కి తీసుకెడుతుంది. కాని, మనం చెప్పేదందరికీ రుచిస్తుందనుకున్నావా? కొందరి భయం—ఇది వాళ్ల భోగభాగ్యాల కేమడ్డు తెస్తుందో అనే. "ఇంకొకళ్లు మాడిచస్తున్నా మన కన్నీఉన్నా" యనే వాళ్ళసంతుష్టి. నానాగడ్డీ తిని అధికారాలు సంపాదించుకున్న మరికొందరు—అవి వొదిలిపెట్టమంటే ఒదిలిపెడతారా? ఇంకొకళ్ళ నెత్తెక్కి తొక్కుతూంటేనే కాని—వాళ్ళకి సంతుష్టుంటుందా? ఈ బురదగుంటలో ఎందుకయ్యా మీ హోదాలూ మీ అధికారాలూ, పైకొచ్చి నలుగురితో సమానంగా బతకండంటే వాళ్లు వింటారా ? వినరు, జ్యోతీ వినరు. పైపెచ్చు మన్ని వెక్కిరిస్తారు, వేళాకోళం చేస్తారు, పిచ్చివాళ్లకింద కట్టేస్తారు. దీనంతకీ మనం సిద్ధపడుండాలి.

తెలివైన ఘటాలమనుకునే వాళ్లింకో కొందరుంటారు. "ప్రపంచంలో కుళ్ళంతా మాకు తెలుసు; కానిదెక్కడ మారుతుందీ, యిదిలా ఉండ వలసిందే" అంటారు వీళ్లు. బి. ఏ. ఎం. ఏ. లు ప్యాసయినవాళ్ళలో మూడొంతులమందిలాంటివాళ్లే, జ్యోతీ. వీళ్లు తెలుసుకున్నవాళ్లూ కారు, తెలియనివాళ్లూ కారు. శ్రమే అయినా, మనం వీళ్ళకీ నచ్చచెప్పాలి.

జ్యో:—రాం, యిదో పెద్దపని సుమా. ఎంతో కష్టంమీద కాని దీన్ని నిగ్రహించుకురాలేం.

రా:—నువ్వింకా ఏం విన్నావ్? ఒక్కొక్కరోజు—ఎవరూ మనం చెప్పింది వినరు—ఎవరూ మన చేరువకి రారు. ఓవేపు బియ్యానికి డబ్బివ్వమనొత్తిడీ; ఓ వే పిల్లు ఖాళీ చేయమనొత్తిడీ—చేతుల్లో చూడొస్తే పావలా డబ్బులు కనపడవు. ఎటు వెళడానికీ ఏం చెయడానికి తోచక—కాలూ చెయ్యీ ఆడని ఆ అవస్థలో—నిజంగా ఆ ఊరు మాజామా అని మనమే సందేహిస్తూ...

జ్యో:—రాం, ఒక్కసారి మళ్ళీ మనం ఊరు చూసొద్దాం రా (అనిద్దరూ గోడెక్కి చూస్తూండగా) ఆహా! జ్యోతిర్మయన్న పేరుకి సార్థకంగా—ఈ మెరుపు దీపాలతో-ఎంతందంగా ఉందో యీ ఊరు! రాం, ఈ ఊరు విడి చెలా వెళ్ళడం?

రా:—వెళ్లక తప్పదు, జ్యోతీ.

జ్యో:—(ఊరుకేసి తిరిగి) ఓ సౌందర్యరాశీ! నిన్ను మళ్ళీ ఎప్పుడు చూస్తానో, నే వెళ్లొస్తా.

[అనేడుస్తూ కూలబడుతుంది. రాం ఆవిడ్ని లేవతీసి ఓదారుస్తూ.]

రా:—ఏడవకు జ్యోతీ, ఏడవకు.

జ్యో:—(ఇద్దరూ కిందకి దిగుతూండగా, ఇంకా ఏడుస్తూనే) ఈ ఊరొదిలి రావాలని నాకులేదు, అక్కడికెళ్లాక మరీ చీకట్లు కమ్ముకు పోయినట్టుంటుంది.

రా:—చీకట్లు కమ్ముకు పోయినట్టెందుకుంటుంది, జ్యోతీ, వెలుతురు చూసొచ్చిన వాళ్లం మనంగా? ఇక్కడ మనం చూసినవి - మళ్ళీ

వాళ్ళే జ్ఞాపకం తెచ్చుకుంటే - మనకెక్కడలేని జవసత్వాలూ వస్తాయి. ఈ లాంటి ఊరుందన్న శుభవార్త - సంఘ శ్రేయస్సుకోరి పాటుపడే వాళ్ళతో చెప్పి వాళ్ళధైర్యోత్సాహాలు బలపరుద్దాం. మనుష్యుల స్వభావా లెప్పటికీ మారవని మనకి కొందరుపదేశం చెయ్యబోతారు. ఇది వట్టికల్ల, జ్యోతీ, మనుష్యుల స్వభావా లెన్నెన్ని సారులో మారుతూ వచ్చాయి. కాని బౌద్ధయుగంనుంచీ యీ నాటివరకూ మారకుండా వస్తూన్నది - యావన్మందికీ సుఖజీవన మేర్పరుద్దామనే మానవుడి ఆకాంక్ష. ఈ ఆకాంక్షతో పనిచేసేవాళ్ళని బందిఖానాలలో పెట్టి, కొరడాలతో కొట్టి తుపాకులతో పేల్చి - దీన్నెలాగేనా అణచివేద్దామని ఎన్నెన్ని ప్రయత్నాలో చేశారు. ఈ ఆకాంక్ష అణగలేదు సరికదా, సర్వతో ముఖంగా వ్యాపిస్తూ వచ్చింది. నువ్వు భారతదేశంలో ఏప్రాంతానికెళ్ళినా - హిమాలయ పర్వతాలు దాటి టిబెట్ దేశం వెళ్ళినా - పసిఫిక్ మహాసముద్రం దాటి అమెరికా వెళ్ళినా - ప్రపంచంలో ఏమారుమూల దేశాలకెళ్ళినా- యీ ఆకాంక్షతో పనిచేసేవాళ్ళు నీకెదురౌతారు. వాళ్ళ నానవాలు పట్టడానికి - కళ కళ లాడుతూన్న వాళ్ళ మొహాలూ, నదురూ బెదురులేని మాటతీరూ - యివే నీకు గుర్తు. మానవ సౌభాగ్యం కోసం పాటుపడడానికి - సర్వస్వమూ ధారపోసి - ప్రతివాడూ ముందుకురాడు. అవసరమైతే ప్రాణంకూడా అర్పించడానికి - ప్రతివాడూ సిద్ధపడడు. ఇక్కడొకడూ - అక్కడొకడూ - యీగ్రామంలో ఓయిద్దరూ - ఆబస్తీలో ఓ నలుగురూ - ఇలాక్రమేణా సంఖ్యపెరిగి - పదులువందలై, వందలు వేలై - లక్షోపలక్షల జనసమూహమై - పదివేలఊళ్ళు కట్టాలన్నా-

జ్యో:—(తలెత్తి ఊరుకేసిచూస్తూ) మన ఊరులాంటివేనా ?

రా:—(అధికోత్సాహపూరితుడై) ఔను, మన ఊరులాంటివే. ఏఊళ్ళో - ధనధాన్యాదుల పెంపుకోసం స్త్రీపురుషుల్నుపయోగించకుండా స్త్రీపురుషుల పెంపుకోసం ధనధాన్యాదుల్నుపయోగిస్తారో; ఏ ఊళ్ళో వాళ్లు-దారిద్ర్యరోగ పిశాచాలని దూరంగా తరిమివేశారో; ఏఊళ్ళో ప్రజలు-అసూయ, ధనకాంక్ష, యీర్ష్య అన్నవెలాంటివో ఎరగకుండా

బతుకుతున్నారో; కొరడా పుచ్చుకొని కళ్ళని లొంగతీసేవాడూ, దాసోహమని వాడికి లొంగేవాళ్ళూ, ఏఊళ్ళో మనకి కనపడరో-ఆలాంటిఊళ్లు. చీకటికొట్లలోంచి బైటకొచ్చి సూర్యచంద్రాదుల సాహచర్యమనుభవిస్తూ ఏఊళ్లోవాళ్లు బతుకుతున్నారో - ఆలాంటిఊళ్లు. వీళ్ళని మళ్ళీ చీకటి కొట్లలో పెట్టడ మెవ్వరికీ సాధ్యంకాదు జ్యోతీ. "మిగతా వాళ్ళందరూ ఏకమై ఆఊరు వశపర్చుకుందామని చూశారుకాని, అదెవ్వరికీ సాధ్యం కాకుండా, ఎక్కడా చెక్కుచెదరకుండా నిలిచుంది."

జ్యో:—(నెమ్మదిగా) పద, రాం, మనం దూరాభారం వెళ్లాలి.

[అని ఉభయులూ నడుస్తూండగా దూరాన్నుంచి భేరీమ్రోత వినపడుతుంది]



Printed at the B. N. K. Press, Q. H. No. MS 100/B.
For Q. H. No. 401. Cat D. 750 Copies—January 1947.

# నటించదగిన నాటకాలు

| | | |
|---|---|---|
| ఉదరనిమిత్తం | మైత్రా | 1- 0-0 |
| ప్రణయరోగులు | షెరిడాన్ | 1- 0-0 |
| విశ్వం పెళ్లి | యజ్ఞన్నశాస్త్రి | 0-12-0 |
| జ్యోతిర్మయి | అ. వెంకటనరుసు | 1- 0-0 |
| డిటెక్టివు | శరదిందు బెనర్జీ | 1- 0-0 |
| చిత్రాంగి | చలం | 1- 8-0 |
| త్యాగం | ,, | 1- 8-0 |
| మంగమ్మ | ,, | 1- 0-0 |
| జయదేవ | ,, | 1- 0-0 |
| శశాంక | ,, | 1- 0-0 |
| సావిత్రి | ,, | 0-12-0 |
| నాటికాగుచ్ఛము | (నాటికలు) | 1- 4-0 |
| సత్యం శివం సుందరం | ,, | 1- 4-0 |

యువ బుక్ డిపో

మద్రాసు బెజవాడ




80



| | |
|---|---|
| మనసు ఫౌండేషన్ | |
| పుస్తకాల పరిశీలనాపట్టిక | |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPL A109 13 139 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | [illegible] |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 [illegible] |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Arwini |
| పేజీలు విడదీసినది | Ramya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |